శ్రీ

# రోహిణీసుధాకరవిజయము.

ఇది "ఆరేబియన్ నైట్సు" లోని "కేమరల్ జమా" యను కథ ననుసరించి వ్రాయఁబడిన ఆఱంకముల నాటకము.

హోతా వేంకటకృష్ణయ్య
ప్రణీతము.



సుబ్బారావుగారిచే
పరిష్కృతము.





కాకినాడ.
ర్తి చినరఘుపతిరావుగారిచే
కాకినాడ ముద్రాక్షరశాలయందు
ముద్రితము.
1925

శ్రీరస్తు.

# రోహిణీసుధాకరవిజయము.

ఇత్యాది "అరేబియన్ నైట్సు" లోని "కేమరల్ జమా" యను
కథ ననుసరించి వ్రాయఁబడిన ఆఱంకముల నాటకము.



హోతా వేంకటకృష్ణయ ప్రణీతము.



పారుపూడి సుబ్బారావుగారిచే ప్రకటీకృతము.

మూడవకూర్పు.

కాకినాడ.
కోటమర్తి చినరఘుపతిరావుగారిచే
కాకినాడ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.
1925.

 [వెల రు 0-12-0

# ప్రకటన.

ఈనాటకము యొక్క సమస్తమైన హక్కులను మేము పొందియున్నాము గనుక మా అనుమతి లేనిది దీని నెవరును ప్రదర్శింప గూడదు.

మరియు మావద్ద సంగీత గ్రంథములు నవలలు నాటకములు వగైరాలు దొరకును. కోరిన యెడల క్యాటలాగు ఉచితముగా పంపబడును.

పారుపూడి సుబ్బారావు & సన్సు.

కాకినాడ.

# విజ్ఞప్తి.

ఆంధ్రనాటక కళాభిమానులారా!

నే నీ గ్రంథమును ప్రప్రథమమున రచియించుటలో, నూతనోత్సాహంబు పేర్మి రసమగ్నుండనై దేశకాలపాత్రంబులను గమనింపకయు భావరసాలంకార విజృంభణంబుల నెక్కింత విపులీకరించితిని. ఆ కారణంబున నియ్యది సహృదయహృదయులగు పాఠకమహాశయులను రంజించెనేగాని మైదానుమూటలతోడను రెండుమూఁడు 'టుమ్రీ'లతోడను గంట గంటన్నరలో నాటకము పూర్తిగా దర్శింపఁబడవలయు ననియెడి నాటకప్రదర్శకులను రంజింపలేకపోయెను.

అట్లయ్యు నీనాటకరాజంబు ప్రాజ్ఞులగు రసికజనసమాదరణంబుననో వస్తుగౌరవంబుననో దైవానుగ్రహంబుననో పెక్కుసార్లు ప్రదర్శనభాగ్యం బనుభవింపకపోయినను కూర్పునకు వెయ్యప్రతులు చొప్పున రెండుపర్యాయములు ముద్రాప్తివడసియు నిప్పుడు తృతీయముద్రణభాగ్యం బనుభవించినది.

ఈ మూఁడవకూర్పున నామిత్త్రుల ప్రోత్సాహముచే నవనాగరిక ప్రదర్శకాభిరుచి ననుసరించి నిజోత్సాహంబు నడంచి రసభంగంబుగాకుండఁ బ్రదర్శనానుకూలంబగునటుల గ్రంథమును మిక్కిలి సంకుచితంబుఁ గావించితిని. దీన నలుంగక వత్సలత్వంబున నన్ను మన్నింపఁ గరుణాతరంగిణులగు విద్వద్వరులఁ బ్రార్థించుచు నింతటితో విరమించుచున్నాఁడను. మఱియు,

తే. గీ. కొంచెమైనను రుచిగల పంచదార
మధురముగ నుండుఁ గాన నెమ్మనములందు
వస్తుగౌరవమున దీనిఁ బ్రాజ్ఞులెల్ల
రాదరింతురటంచు నే నాత్మఁదలఁతు.

కాకినాడ.
ది 15-7-1925,

ఇట్లు విన్నవించు
విబుధజన విధేయుఁడు,
హోతా వేంకటకృష్ణకవి.

# ఈనాటకములో వచ్చు ముఖ్య పాత్రములు.



—: పురుషులు :—

1. రత్నాకరుఁడు—సింహళద్వీపము నేలెడు రాజు. (కథానాయకుని తండ్రి)
2. సుధాకరుఁడు—రత్నాకరుని పుత్రుఁడు. (కథానాయకుఁడు)
3. విశారదుఁడు—సుధాకరుని నర్మసఖుఁడు.
4. దత్తుఁడు—పాంచాలదేశపు రాజు. (కథానాయిక తండ్రి)
5. మారుతి—దత్తుని మంత్రి.
6. చిత్రసేనుఁడు—రోహిణి సోదరుఁడు. (బాటసారి)
7. జనమిత్రుఁడు—కంచుకి. (దత్తుని భటుఁడు)
8 పుష్పదంతుఁడు—గంధర్వుఁడు. (మనోరంజని భర్త)
9. కామపాలుఁడు }
10. సుదంతుఁడు } పురజనులు.
11. రాజశేఖరుఁడు—మగధదేశాధిపతి.
12. మానవర్మ—రాజశేఖరుని మంత్రి.

—: స్త్రీలు :—

1. రోహిణి—దత్త రాజు కూఁతురు. (కథానాయిక)
2. మనోరంజని—గంధర్వస్త్రీ (పుష్పదంతుని భార్య)
3. వకుళ }
4. మాధవి } రోహిణి చెలికత్తియలు.





శ్రీరస్తు.

# రోహిణీసుధాకరవిజయము

నాందీ-ప్రస్తావన.

మ. అకలంకుండు ననాదిపూరుషుఁడు ని ♦ త్యాత్ముండుఁ జిత్స్వప్రకా
శకుఁ డానందమయుండు నవ్యయుఁడు వి ♦ శ్వద్రష్ట లోకాధినా
యకుఁ డామ్నాయవిహారుఁ డచ్యుతుఁడు స ♦ వ్యక్తాంచితాధ్యాత్మత
త్వకళాలంకృతుఁ డీసభాసదుల ని ♦ త్యంబున్ గృపన్ బ్రోచుతన్.

ఉ. తమ్ములసూడు మామ వెలి ♦ దమ్ములు బాణచయంబు లండజా
తమ్ములు వాజు లిక్షువు సు ♦ ధర్మముఁ గాఁగఁ బ్రమత్తచంచరీ
కమ్ముల శింజినీరవము ♦ గల్గి విరాగజయేచ్ఛ నొప్పు నా
కమ్మనివింటిజోదుఁ కృతు ♦ కమ్మున సౌఖ్య మొసంగు మీకిలన్.

(అని సభ్యులపైఁ బుష్పములను జల్లుచున్నాఁడు.)

ఇట్లు నాందిముగియఁగానే,

సూత్రి—ఆహా! నేఁటికి నాపూర్వభవపుణ్యలతాంకురంబులు ఫలించినవి కాఁబోలు. సకలకలాకోవిదవిద్వజ్జనసందోహబంధురంబగు నీ సభామందిరంబున నే నమందానందకందళితహృదయారవిందుండనై నా నేర్పువిధంబున నీనాటకంబును బ్రదర్శించెద. నటీ! నటీ!

నటి—ఆర్యా, ఇదిగో వచ్చితిని. (అని సూత్రధారుని సమీపించి) నాథా, ఏమిసెలవు? నేనలంకృతురాల నగుచుండ పిల్లల

నన్నింత తొందరగాఁ బిలిపించితిరి? (అని నలుప్రక్కలఁ గల యఁజూచి) ఆహా! ఆశ్చర్యము. ఆశ్చర్యము! (అని వెఱఁగు నభినయించుచు.)

ఉ. అక్కడ వ్రేలుచున్న యవి • యందపురంగుల నొప్పు పెండెలల్
మిక్కిలి నాదుచూడ్కి మిఁకు • మిట్లను గొల్పెను దీపకాంతులీ
దిక్కునఁ దంత్రినాదములు • దివ్యపుగానములుం జెలంగు న
ల్లక్కడ సభ్యులందఱుర • యంబునఁగూడి రిదేమి చిత్రమో!

సూత్ర—ఆర్యా! ఇపుడిచట శృంగారకరుణారసంబులు వెల్లిఁగొల్పెడు నొక్కచమత్కారమైన నాటకము ప్రదర్శింపఁబడునని విని దానిని గౌరవించుటకై సభ్యులందఱు దయచేసియున్నారు. దుర్ఘటంబగు నిక్కార్యంబును నెరవేర్చుటలో నాకు సహకారిణివిగ నుండుదువని నిన్నిటకు రప్పించితిని.

నటి—సరేకాని, నాథా, నాటకంబులన నిపుడెన్నియో ప్రబలియున్నవి. ఇపు డిచట నెద్దానిం బ్రదర్శించెదరు?

సూత్ర—సతీమణీ! నీ వెఱుఁగనే యెఱుఁగవా చెప్పెదవినుము.

మ. వరశాండిల్యసగోత్రపావనుఁడు వి • ద్వద్వర్ణనీయుండు భా
సురసత్కీర్తిరతుండు కర్మనిరతిన్ • శుభ్రప్రభావాఢ్యుఁడై
గరిమన్ మాతృమహాన్వయాంబునిధి రా • కాపూర్ణ చంద్రుండనన్
ధరణిన్ వెంకటరత్నమార్యుఁడలరెన్ • ధర్మాన మోదాత్ముఁడై.

చ. వెరవరి తత్కుమారుఁడగు • వేంకటకృష్ణుఁడు కల్కిబోఁటిన్
గరమొకనూత్నమార్యమును • కానుకగానిడ రోహిణీసుధా
కరవిజయంబు నాగనొక • కల్పిత నాటకమున్ రచించె నో
గురుకుచ! యీసభాసదుల • కోరిక నయ్యది యాడఁగాఁబడున్.

నటి—నాథా! నేను చేయవలసిన కార్యమెట్టిదియో నియోగింపుఁడు

సూత్ర—సుందరీ మనము ప్రదర్శింపఁబోవునది శృంగారరసప్రధాన నాటకముగనుక తద్రసపోషకంబగు వసంతఋతువును లలితమగు నీకంఠకలనాదంబుచే గానానందరసంబు వెల్లిగొల్పుచు వర్ణించి ముందుగ నీసభ్యులవీనులకు విందొనర్పుము.

నటి—చిత్తమాలాగే చేసెదను.

జంఝూటిరాగము-చాపుతాళము.

చూడుమిా వసంతసమయశోభ లెల్లను. (పల్లవి)

చరణములు.

1. దిటముగ హిమకరుఁడు మింటఁ ♦ దేజరిల్లఁగా
విటులుమదన బాధచేత ♦ వెతలనొందఁగా
కుటిలత మలయానిలుండు ♦ కోమరుమిగులఁగా
కటము లదరఁబికరుతములు ♦ కలయఁజెలఁగఁగా॥చూడుమిా॥
2. వెలయ నికుంజములుపువ్వు ♦ వితతి సలరఁగా
దళితకుసుమగర్భ సుధా ♦ ద్రవమెసంగఁగా
గ్రోలిఝంకృతులఁ దేటి ♦ కొదమ లొప్పఁగా
కలితవాహ్యాళి మదన ♦ ఘనుఁడు వెడలఁగా॥చూడుమిా॥

లయగ్రాహి.

కొమ్మలనువ్రాలుచు ఫ ♦ లమ్ములనుగ్రింపుచుఁబి
కమ్ములటు సామవచ ♦ నమ్ములను బాడఁగ
గమ్మనగు తేఁజిగురు ♦ లమ్మెసఁగు కోయిలలు
చిమ్మనయనాగ్నులుస ♦ తమ్మును వెలుంగఁగ
దమ్ములసుధారసము ♦ జుమ్మనుచు గ్రోలునల
తుమ్మెదల మాంత్రిపఠ ♦ నమ్ములను కల్యా
ణమ్ము వనలక్ష్మికిఁది ♦ రమ్ముగ వసంతునికి
నిమ్ముగను సాఁగుసుఖ ♦ దమ్ముగఁగవంగఁగ.

సూత్రి—ఆహాహా! కోమలీ. సకలజన మనోల్లాసకరంబగునివ్వసం
తంబు తావకీన మనోహరగానకలాపాభివర్ణనచే నెంతయొప్పు
చున్నదో చూడుము.

తే. కమ్మనాసీదు కలకంఠ ♦ కంఠనాద
మహిమఁగాబోలు మోడులు ♦ మల్లెజిగిర్చి
మంచుబిందుల మిష చేత ♦ నించుచుండెఁ
బణతిరో! కంటె యానంద ♦ బాష్పములను.

నటి-చ. మనములరించుగంధగిరి ♦ మారుతముల్ పికకాకలీకల
స్వనములు లేత వెన్నెలలు ♦ సౌరభముల్వొదజల్లునట్టి క్రొ
న్ననలును తేఁటిరఝాంకృతుల ♦ నారతముఁ మిథునోత్సవంబు గాఁ
దనరెడు నివ్వసంతమున ♦ ధారుణి నెవ్వరు సంతసింపరో.

సూత్రి—(ఆలకించుట నభినయించి) ప్రేయసీ. కుశీలవు లప్పుడే
గానమున నుపక్రమించినారు వినుము.

[తెరలో]

చ. సుకృతులువిధేయులై హితవ ♦ చోవిజితాత్ములుఁగాక యుండి వ్య
ర్థత నిహసౌఖ్యముల్విడిచి ♦ దర్పకసాయకపఙ్క్తి కోడి సం
తతము ను భ్రాంతులం బగిలి ♦ ధైర్యము దూరఁ దపింతురంచు ప్రి
న్నాతలమునుంగు రాజులకు ♦ వేడుక లెక్కడివిమ్మహీస్థలిన్.

నటి—నాథా! నాటకపాత్రములు రంగస్థలమునకు వచ్చుచుండెడు
గాఁబోలు. పోవుదమురండు.

సూత్రి—మంచిది.

(అని యిరువురు నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావనము.



శ్రీరస్తు.

# రోహిణీసుధాకరవిజయము.

## ప్రథమాంకము.

[రత్నాకర మహారాజు చింతాక్రాంతుఁడై యొక్కరుండ ప్రవేశించును.]

రత్నా:—

చ. సుతులు విధేయులై హితవ ♦ చోవిజితాత్ములు గాక యుండి వ్య
ర్థత నిహసౌఖ్యముల్ విడిచి ♦ దర్పక సాయకపంక్తికోడి సం
తతమును భ్రాంతులందగిలి ♦ ధైర్యము దూలఁ దపింతురంచుఁ బె
న్వెతలమునుంగు రాజులకు ♦ వేడుక లెక్కడి యిమ్మహీస్థలిన్.

ఆఖండలవైభవము ననుభవింపఁదగిన మహారాజ్యపదవి నాకొసంగియు విషమిళితపాయసాన్నంబిడిన చందంబున నాకిట్టిచింత మేలకూర్చితివి దేవా.

క. వెలయఁదనూజునిఁ బడసితి
సలలిత సద్వ్రతములోలి ♦ సలుపుచు నతఁడుం
గులదీపకుఁడగునని నేఁ
జెలఁగితి వాఁడెంత మూర్ఖ ♦ చిత్తుండయ్యెన్.

గృహస్థయినంగాని క్షత్రియపుత్రుండు రాజ్యార్హుండు గానేరడని పెద్దలు చెప్పుదురు. నేనింక నీరాజ్యభారము నెవరిపాలుచేసెదను ?

[అంత విశారదుఁడు ప్రవేశించి రాజునకు ప్రణమిల్లును.]

రత్నా—విశారదా! నీ హితోపదేశ మేమైన నాపుత్రుని వైవాహికశుభము విషయమై కార్యకారియయ్యెనా?

విశా—మహారాజా! అబ్బాయిగారి చిత్తంబునం దనురాగబీజంబును నాటి శృంగారరసాంకురంబును గలుగఁజేయ నేనెన్నియోవిధంబుల బ్రయత్నించితిని. వాని మనోబలమేమో గాని పరిణయమొల్లనని భీష్మించియుండె. ఏమని చెప్పుదును.

చ. జననుతకీర్తి సద్గుణ వి♦శాలమనోహరరూపసంపద
ఘనతరబుద్ధి నెందున స♦ఖుండఁడ నీమహనీయరాజ్యమున్
గొని విలసిల్లుమా యదమిఁ ♦ గోరితి నెంతయు గాని వెఱ్ఱి తీ
రెరు తలఁజుట్టు లోకలను ♦ రీతినిఁబట్టుఁదొరంగఁ డింతయున్.

రత్నా—విశారదా, నయ విశారదా.

ఉ. ప్రాయమునందు మానవులు ♦ వారిరుహాక్షులఁ బెండ్లియాడి పు
త్త్రాయుత రాజ్యవైభవ స♦మన్వితులై చెలువారుచుండి య
త్యాయతకీర్తిచే నెగడ ♦ నచ్చెరువయ్యెడు బెండ్లియాడనం
చీమొన బట్టు పట్టుటకు ♦ నేమికతంబొకొ వానికక్కటా.

అయినను సుధాకరునిటకుఁ దోడ్కొనిరమ్ము. నేనుకూడ నింకొకసారి మృదుమార్గమున బోధించి చూచెదను.

విశా—చిత్తము. (అని నిష్క్రమించి సుధాకరునితోఁ దిరుగ బ్రవేశించును.)

సుధా—(స్వగతము) పరమార్థవృక్షమూలచ్ఛేదకారకులగు భామినీజనంబులఁ జేబట్టనేల దుర్గతులపాలు గానేల.

చ. అలికులవేణిచే దశర ♦ థావనిపేంద్రుఁడు వీడె ప్రాణముల్
వలపును బెంచి పెన్నొయల ♦ వాలుకనుంగవ తళ్కుబెళ్కుచూ

పుల భృకుటీవిలాసములఁ ♦ బొందికమాటల నెట్టివారలన్
గలఁచెద రీమృగాక్షులు క ♦ న న్మఱి మృత్యువు వేఱియున్న దే.

రత్నా—(పుత్త్రిని దగ్గరఁ జేర్చి యాలింగనం బొనర్చి చుంచుదువ్వి చుబుకంబుఁ బుణుకుచు) కుమారా! పరిపూర్ణయౌవనవంతుఁడవయ్యు నీవిట్లు పరిణయపరాఙ్ముఖుండవు గా నేలరా తండ్రీ.

మ. తనయా! నీవిటు మూర్ఖచిత్తునిక్రియన్ ♦ ధర్మంబె రాజాన్వయం
బున జన్మించి విరాగివై పొలుపఱన్ ♦ బూఁబోఁడిఁ బెండ్లాడి ని
మ్మిని సామ్రాజ్యరమావిభూతి గని పే ♦ ర్మిన్ భూజనోల్లాసివై
జననిన్ నన్నును వృద్ధులన్ దనుప నీ ♦ స్వాంతంబునన్ దోఁచదే.

సుధా—తండ్రీ! నన్ను నుగ్రహింపుఁడు.

ఉ. లోకమునందు మానవులు ♦ లోలతఁ గామినుల స్వరింపుచున్
భీకరమోహపాశములఁ ♦ బెద్దయుఁ జిక్కి తపించుచుండరే
ప్రాకట భంగిఁ జేడెల వివాహముఁ ♦ జేసికొనంగరాదు ద
ర్వీకరమట్లు కామిని వ ♦ రించిన వాని హరింపఁ జూడదే.

జనకా, పరిణయబంధం బభిలషించువారికి,

మ. అమలాంగి స్వరియింపఁ జింతయు నప ♦ త్యప్రాప్తికై చింత కూ
టమిపొందైన భరింపఁ జింతయును జా ♦ ద్యగ్రస్తతఁ జింత దుః
ఖములుం గల్గినఁ జింత, సౌఖ్యమొదవం ♦ గాఁ జింత సంసారకూ
పమునం ద్రెళ్ళిన వారికెల్లనివి సం ♦ ప్రాప్తంబులౌ చూడుఁడీ.

కావున ప్రకృతివిషయవాంఛాలవాలంబును తామసరజోగుణ సంకీర్ణమూలంబును చింతాపరంపరా పత్రంబులును, అస్థిరానందప్రదర్శక గర్భాంతరదుఃఖ క్రిమిసంకలితైహిక వినోద పుష్పంబులును, పాపకర్మ ఫలంబులును, గలిగి యొప్పుచుండు సంసారవృక్షంబు నాశ్రయించి దుర్గతులపాలు కానేల? నన్ను నిర్బంధింపకుఁడు.

రత్నా—కుమారా, ఇంత చిఱుతప్రాయంబుననే నీవింతటి వైరాగ్యం
బును బూననగునే?

ఉ. నీవు వివాహమాడి రమ ♦ ణీమణిఁ గూడి విశేష రాజ్యల
క్ష్మీవిభవంబుఁ గైకొని య ♦ శేషజనుల్ గొనియాడ నేలుచున్
భూవిదితోరుకీర్తి పరి ♦ పూర్ణుఁడవై యలరారి వంశముం
గావ ననంగ నిన్నుఁ గనఁ ♦ గన్నులు చల్లనఁ గావె పుత్రకా.

కన్నతండ్రి నామాటవినుము.

చ. గుణనికురుంబ సచ్చరితఁ ♦ గోమలసుందరగాత్రిఁ గన్యకా
మణిని వివాహమాడి జన ♦ మాన్యుఁడవై పరితృప్తయాచక
ప్రణుతుల నొప్పుచు న్విజిత ♦ రాజకిరీటమణిప్రభన్ గృహాం
గణము నలంకరించి చిర ♦ కాలము కీర్తి ననంగ రాదొకో.

సుధా—జనకా, ప్రాజ్ఞులయ్యు మీరు నన్నిట్లేల నిర్బంధించెదరు.

తే. సకియచూడ్కి యె విషవహ్ని ♦ సదృశమరయఁ
బొలఁతి విభ్రమ మాభోగ ♦ భోగతుల్య
మట్టిజవరాలి నొర్తుఁ జే ♦ పట్టుటెల్లఁ
జన్నగంబును దరిఁజేర్చు ♦ పగిదిగాదె.

రత్నా—అరే మూర్ఖా, నీపట్టిన పంతము ను విడువకుండితివి. నిన్నిపు
డేమిచేసెదనో చూడుము. (అని గద్దియడిగ్గి సుధాకరు నద
లించుచున్నాడు.)

విశారదు—మహారాజా, శాంతింపుఁడు శాంతింపుఁడు.

రత్నా—(సామర్షంబుగా) ఏమీ!

చ. జనకునియాజ్ఞ మీరుచు య ♦ శంబుఁ గులంబు సముద్ధరింపఁ గా
మనమున నిచ్చలేక సఖి ♦ మానముఁ ద్రోచి చరించుచుండెనా
తనయుఁడు నీతిబాహ్యుని వి ♦ ధంబునఁ బంతము వీడకుండె దం
డనముఁనగాని మక్కరిమ ♦ డంగదు వీనికి రొంతచెప్పినన్.

సుధా—తండ్రి, యేల నాపై రోషించెదరు నాసత్యము వినుండు.

ఉ. సతతముఁ బెండ్లి మాని భవ ♦ సాగరదుఃఖనివారకోర్మికా
వితతిని మున్గి తేలుచును ♦ వేసటఁ గాసిలుచుండఁ జాలనో
క్షితితలనాథ! యేమి ననుఁ ♦ జేసినఁ జేయుఁడు కాని నామనం
బతివలఁగూడి దుఃఖముల ♦ నార్తిఁ గృశింపఁగ నోపదెమ్మెయిన్.

రత్నా—(కోపోద్దీపితుఁడై) వీనితోనింక వాగ్వ్యయ మనవసరము. విశారదా, నీవు వెంటనే తలారులను బిలిపించి,

క. జనకుని యానతి నిర్విధి
వినవొల్లని మూర్ఖచిత్తు ♦ విగతవివేకుఁ
గొనిచని వే బాధింపుఁడు
కనికరమింద నేదిబాధి ♦ గంబునహీనిన్.

విశా—మిత్రమా, సుధాకరా, ఏల నీవిట్లు బేలవై చెడియెదవు? నీకు గారాగృహమునందుండుటయే శ్రేయమని తోఁచెనా?

సుధా—సఖా, నాచిత్తము పరమార్థదాయకంబగు మఱి యేపనికైన నంగీకరించునుగాని కన్యాపరిగ్రహణంబునకు మాత్ర మిచ్చగింప నేరదు. వినుము,

చ. పరమపదంబుఁ బాపు కల ♦ భామినుల న్వరియించుకంటె దు
ష్కర మిఁక నద్రిసల్లుచెర ♦ సాలవసించిన నేమి కాననాం
తరముల నిల్వనేమి వసు ♦ ధాధర గహ్వర సీమలందు సం
చరణము సేయనేమి భవ ♦ సాగర సంగతిఁ బాయఁగల్గినన్.

రత్నా—మంచిది. విశారదా, నీవు వీనిని వెంటఁగొనిపోయి నాయాజ్ఞ నెరవేర్చిరమ్ము. పొమ్ము.

విశార—చిత్తము (అని సుధాకరునితో నిష్క్రమించును)

రత్నా—రాజన్యాంతరకర్మకరిపాకం బిట్లుండెఁగాఁబోలు. ఏదైవమైన నడ్డపడకుండునా? (అని రత్నాకరుఁడు నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.



శ్రీరస్తు.

# రోహిణీసుధాకరవిజయము

## ద్వితీయాంకము.

[అంతరిక్షమునుండి మనోరంజని యను నొక ఖేచరి ప్రవేశించును.]

మనో—(అద్భుతరసము నభినయించుచు) ఏమి యీరాకొమరుని సౌందర్యము !

క. దీపము లేకుండిన వే
దీపములం బెట్టినట్లు ♦ దీప్తులు నిగుడన్
దీపించెడు రాకొమరుఁడు
కాపురుషుం డుంచె బంది ♦ గంబున వాసిన్.

కటకటా ! అంతఃపురసౌధాంతరంబులఁ బ్రకాశింపఁజేయు సుకుమార శరీరుం డగునృపకుమారుని నిర్దయుండై కారాగృహబద్ధునిఁ జేయుట కెవరి కిట్లు మన సొప్పెనో కదా.

ఉ. దాసనకాచపాత్రసువి♦తానము పుర్వులబూజుపెంటలన్
భాసుర చందనాగరుసు ♦ వాసనజాలము గబ్బిలాల మూ
త్ర్యాసన హంసతూలిక వి ♦ రాజితశయ్య శిలామహీస్థలిన్
జేసినబందిఖాన నృప ♦ శేఖరసూనుఁడు దూలుచుండఁగా.

ఈలాటి నవమోహనాకారము భూలోకమున లేదు సరేకదా సిద్ధసాధ్య గంధర్వామర శ్రేష్ఠులయందైనం గానరాదు.

[అంత పుష్పదంతుఁడు ప్రవేశించి]

పుష్ప—ఆ! సుందరీ, యేమనుచున్నావు. జగజ్జేగీయ మానసౌందర్య రాశి యగు కన్యకాలలామంబు నొక్కచో నేత్రోత్సవంబుగఁ జూచి వచ్చితిని, వినుము. పాంచాలదేశంబునఁ దేజోరాశి యనందగు కన్యకాతిలకం బొండు గ్రాలుచున్నయది. ఆమించు బోఁడి సోయగం బెన్న నలుమోములు దాల్చిన తమ్మిచూలి కైనను వేయిమోములు దాల్చిన చిలువరాయని కైనను నలవి కాదు. ఇంతయేల,

ఉ. ఆ యెలనాగ నెమ్మొగము ♦ నంబుజవైరి యటన్న భ్రాంతిచేఁ
బోయి యనంతమార్గమునఁ ♦ బోయెడు చందురునిఁ జూచి యద్దిరా!
యీయెడఁ జందురుం డిద్ద రుదయించి రిదేమని రాహుకేతుపుల్
సేయఁగ లేమి నద్దియు శశిగ్రహణం బటఁ గల్గలేదు సూ.

చ. తలిరులబోణి వాక్పృయ శతాంగము నెక్కి విలోలనేత్రముల్
కలితపతాకలై చెలఁగ ♦ గన్బొమలన్ దగు విండ్లుబూని చూ
న్కులగమి తూఁపు లుప్పతిలఁ ♦ గుంతలసైన్యముఁ గూడ స్వచ్ఛవకా
గళమను శంఖ మొత్తుమను ♦ కాముఁడు లీలఁ జరించు నిచ్చలున్.

మనో—ప్రాణేశ్వరా! మీ యుత్ప్రేక్షాప్రాగల్భ్య మంతయు వెల్లడించు చుంటిరి. నేఁ జూచిన సౌందర్యరాశికన్న వేఱొండు మఱొక్కచో నుండునన్న నే నమ్మఁజాలను.

పుష్ప—ఓసి వివేకహీనురాలా! వినుము.

చ. అతివముఖాబ్జపుష్పరస ♦ మానఁగ గుంపులుగూడి తేఁటులూ
ర్జితగతి నేగుదెంచి యటఁ ♦ జెన్నగు చంపకముంచు నాసికన్
మతి భ్రమియించి పాదనలినంబులఁ జేరఁగ నేగనాఁగ నం
చితగతి వ్రేలుచుండు వసజేక్షణ దీర్ఘ శిరోజపుంజముల్.

వేయేల,

మ. అనయం బాచెలి రోమరాజి ఫణి గం ♦ గావర్తమున్నాభి స
ద్ఘనవల్మీకమునందుఁ బుట్టి ముఖరా ♦ కాబింబమున్ మ్రింగఁజూ
చిన రాహుం డగు నాపుఁ దత్కుచగిరి ♦ శ్రీమద్ద్వయం బంతయున్
గని తెల్పన్ వడి నేగుఁ గర్ణముల కా ♦ కన్యాంబ కాబ్జాతముల్.

మనో—నాథా ! మీ వర్ణనాసామర్థ్యమును గొనియాడ నే నెంతటిదానను. భూతలంబునం గల సింహళద్వీపంబున నలకూబర జయంత వసంతులకు రూపనియంత్యం డనందగు నొకనరపాల తనూజుండు నిర్దయాత్ములచేఁ గారాగృహస్థాపితుండై యందు శారదాంబుదాంతర్గతుండగు యుడుపతివడువునఁ దేజరిల్లుచున్నాఁడు. ఆ రాచకొమరుని దివ్యసౌందర్యరేఖావిలాసంబులం గొనియాడ నే నెంతటిదానను. వాని నెల్ల వినినచో మీరింతకన్నను మోహావేశపరవశు లగుట నిశ్చయము. వాని సౌకుమార్యంబుఁ గన్నులారఁ గాంచినచోఁ బురుషులకైన మనోజవికారంబు లంకురించును. నాథా ! మీ రాసుందరాంగునిఁ జూచియుండలేదు కాఁబోలు. చూచియుండినచో మీ రట్లు పలుకుదురు. వినుఁడు,

ఉ. వాని మనోహరాంగమును ♦ వాని ముఖేందువిలాసరేఖయున్
వాని విశాలనేత్రములు ♦ వాని భుజద్వయి దైర్ఘ్యసంపదల్
వాని యురస్థలోన్నతియు ♦ వాని నఖంబులు హాసచంద్రికల్
మానక మీరు చూచినను ♦ మానిని నింతగఁ బ్రస్తుతింతురే.

పుష్ప—ప్రేయసీ ! చక్షుర్విషయ సంయోగంబువలనంగాని భిన్నపదార్థాభిమానంబు లేకీభూతంబులు కానేరవు. కావున మన మిర్వుర మాకారాగారము చెంత కేగి యా మహనీయతేజశ్శాలుర నొక్కచోఁ జేర్చి చూచివత్తము రమ్ము.

మనో—మంచిది. రండు. (అని యిరువురు సుధాకరుఁ డున్న చెరను గూర్చి నిష్క్రమింతురు)

[కారాగృహములో సుధాకరుఁడు.]

సుధా—(స్వగతము) అన్నా! లోక మెంతమాయామోహితమై యున్నయది! అవిద్యావృతంబునకు మూలాలవాలంబగు కామినీవ్యామోహమహిమను పామరజనంబు లెంతయెక్కుడు చేయుచున్నారు! అన్నా! నిష్కారణము జను లెట్లు మోహమదాంధులై చెడిపోవుచున్నారు! పరమదాక్షిణ్యమూర్తి యగు పరమేశ్వరుండు మానవుల కీయజ్ఞానము నేలఁ బాపకుండునో తెలియరాదు.

ఉ. కామినుల స్మరింప మదిఁ ♦ గల్గెడు కామము కామపూర్ణతన్
బ్రేమములూనఁ బ్రేమమునఁ ♦ బెద్దయు మోహవశాత్ముఁడై నరుం
డేమఱి తృష్ణచేఁ దవిలి ♦ తృప్తిఁ జెందక లోభమగ్నుఁడై
తామసవృత్తి దుష్క్రియలఁ ♦ దద్దయుఁ జేయుచునుండు నిమ్మహిన్.

వహ్వా, నా కీకారాగృహవాసమే యుక్తమైనది. ఇచట నిశ్చలాంతరంగుండనై యేకాంతంబుగఁ బరమార్థవిచారణఁ జేసికొనుచు బాహ్యప్రపంచంబుతో సంబంధమును దొలఁగించుకొనఁ బ్రయత్నించెద. కాలాతీత మైనది, నే నింక శయనించి నిద్రింపవలయును. (అని సుధాకరుఁడు శయనించి నిద్రించుచున్నాఁడు.)

[అంత మనోరంజని ప్రవేశించి]

మనో—(చెరసాలలో నిద్రించు సుధాకరునిఁ జూచి తనలో) నాప్రియుని యహంకార మేమనందగు?

ఉ. ఎందఱిరాజపుత్త్రికలను ♦ నిందుని భాస్కరులఁ జూడలేను వా
రందఱు వీనియందమగు ♦ నాకృతి కెన్నఁగఁ గాలిగోటికై

సం దలపంగఁ బోలరు క ♦ నన్ బరికింపఁగ రానియట్టి యా
చందము మిన్నుమన్నుపయి ♦ సత్యముగాఁ గనియుంటిమే యెట

[అంతట సుప్తిం దలిలియున్న సుందరీసహితుండై
పుష్పదంతుండు ప్రవేశించి]

పుష్ప—ప్రియా! నే నాకలువకంటిని గొనివచ్చితిని. చూడుము (అ
యాకోమలాంగిని గనఁబఱచుచు)

ఉ. ఈ యువతీలలామ కెన ♦ యే పరికింపఁగ నెట్టివారలున్
గాయజువిండ్లు కన్బొమలు ♦ కాంచనకంబుకముల్ కుచంబులే
మాయెననంగ మధ్యము న ♦ మానుష తేజము నిట్టివారి నే
రేయుగమందునైనఁ గని ♦ రే విని రే మఱి ధారుణీస్థలిన్.

క. నా కర్కశహస్తంబుల
నీకోమలగాత్రి నిటుకు ♦ నేఁ దెచ్చిన నా
హా! కంటె! యీమె పసిఁడిన
లాకు పుటము వెట్టినట్టు ♦ లం గనుపట్టున్.

మనో—నాథా! ఈ కోమలాంగిని మన మారాజకుమారునిప
జేర్చితిమేని వారివారి సౌందర్య తారతమ్యంబులు స్ప
ష్టపడియెడు.

పుష్ప—మంచిది. (అని యట్లఁ జేయును.)

మనో—ఆహా! వీ రిద్దరిసౌందర్యంబును వర్ణనాతీతంబుగ నే కాన్పి
చున్నయది.

క. సుందరరూపంబుల నా
నందముగా నావిశాల ♦ నయనంబుల నిం
పొందఁగఁ జూచిన డెంద మ
మందపరవశత్వమొందె ♦ నై యుప్పొంగన్.

పుష్ప—ఏమి యీ మోహనాకారములు!

. కలితోద్భాసితరూపసంపదల నే ♦ గన్నార వీక్షింప స
ల్లలితానందరసాబ్ధిపేదికల డో ♦ లాకేళిలోలాత్మయై
లలి నొప్పారు మదీయమానసమరా ♦ ళం బిప్డు డత్యద్భుతో
జ్జ్వలతేజంబుల తారతమ్యముల నా ♦ బ్భంగి న్విమర్శించునో!

నో—నాథా! ఇట్లీసుదీయక భాసిల్లె డీయనన్యసామాన్య తేజో
రాసులలో తారతమ్యముల నేర్పఱుప నా కొకయుపాయము
తోఁచుచున్నయది. మనము భ్రమరాకృతులం బూని యీ
మోహనాకారులలో నొకరు నిద్దురఁజొక్కియుండ వేఱొకరిఁ
జొప్పునఁగుట్టి మేల్కొల్పుచు వీరల పరస్పరవర్ణనాతిశయం
బుల బాగుగఁ బరికించినచో సౌందర్యతారతమ్యం బించుకేని
యుండనేని స్పష్టపడియెడు. ఇంతకు మిక్కిలి సాధనోపాయం
బెద్దియు నాకుఁ గానరాదు.

ప్ప—మంచిది. అటులనే చేయుదము (అని యిరువురు భ్రమరా
కృతులఁ బూనుదురు.)

ధా—(శయ్యపైనుండి జిగ్గన లేచి) అబ్బా! ఈ ప్రిమదాళి నా
చెక్కిట నెంతతీవ్రముగాఁ గుట్టినది. (అని ఇటునటుఁ జూచి)
ఆఁ ఏమిది! ఏమి యీకాంతి! ఓహో కన్నులు మిఱుమిట్లు
గొలుపునటుల దేదీప్యమానంబుగఁ బ్రజ్వరిల్లు నీయపూర్వ
తేజం బెంతయు నా కత్యాశ్చర్యంబును గలిగించుచున్నది.
(అని సుప్తిం దవిలియున్న సుందరాంగినిఁ బొడఁగాంచి) ఆహా!
ఆశ్చర్యము! ఆశ్చర్యము! ఈ జగన్మోహనస్వరూప మిచటి
కెట్లువచ్చెనో కదా! ఇట్టి యపూర్వతేజశ్శాలిని నే నెన్నఁ
డును జూడనైతిని. ఇది యేమిదైవమాయయో తెలియరాదు.
ఓహో!

సౌరభ మొందు బంగరపు ♦ జంత్రిపుబొమ్మయొ! మార్దవంపు చె
ల్వారెడు రత్ననిర్మితశ ♦ లాకయొ! నిశ్చలలీలఁ బొల్చు తొ

ల్కాలముమైనఁగా! జీవకళ ♦ గల్గిన చిత్తరువో కాక! నాఁగ నీ
తీరునఁ బ్రజ్వరిల్లు నము ♦ దీర్ఘమనోహర తేజ మేమొకో!

శా. ఏమీ! చూడఁగఁ జోద్యమయ్యె నడిరే ♦ యి న్వచ్చి నాకజ్జలో
మోమోటం బిసుమంత లేక నిదియే ♦ మోహాముగాఁ బాడె నీ
భూమిన్ గుబ్బిమ్మరవచ్చినట్టి రతియో ♦ పూర్ణేందుబింబాస్యమా
భామారత్నము నంపికో పరులు నా ♦ భావంబు శోధింపఁగన్.

అట్లుఁ గాక,

తే. గీ. నాదు తలిదండ్రులే మంత ♦ నమున నాదు
నంబు వైవాహికప్రియ ♦ త్నంబునందు
విచ్చుఁ గొనునట్లుఁ జేయ నీ ♦ మచ్చకంటి
సర్ధనిశియందు నాకజ్జ ♦ కంపిరేమొ.

మఱియు,

క. ఈతన్వినె కాఁబోలును
నాతలిదండ్రులు కడంగి ♦ నాకు వివాహం
బాతతవైభవ మొప్పఁగఁ
జేతోమోదమునఁ జేయఁ ♦ జింతించి రహా!

హా! ఈశ్వరా! నే నిపు డొంతయు డోలాయమానమానసుండనైయున్న వాఁడ. ఏమి చేయుదును. ఈకాంత నవలావణ్యదీధితులు నాహృదయ భేదనం బొనర్చుచున్నవి. నాచిత్త మెంతయుఁ జలించుచున్నది. వహ్వ ఏమిది!

సీ. నీలవర్ణపుకాంతిఁ ♦ గాంచెను నియ్యది బంభ, రాళి యేమో కావు ♦ బాలకురులు
అతిమనోహరముగ ♦ నలరారు నిది చంద, మామ యేమో కాదు ♦ భామమోము
కమ్మనివలపులఁ ♦ గడువెల్గు నిది తిల, పుష్పమేమో కాదు ♦ పొలఁతినాస
పరిమళం బగు కాంతిఁ ♦ బరిఢవిల్లెడు నిది, శంఖ మేమో కాదు ♦ సకియ గళము
తే.గీ. అసదృశంబుగ వటుపైన ♦ లైన యివియు, చక్కవగ వేమొ కా వింతి ♦ చన్నదోయి
వరలుచున్నట్టి లావణ్య ♦ వనధి వీచి కాళి యివియేమొ కావు ♦ జాతీవళులు.

ఆహా! ఏమి యీసౌందర్యము!

క. నెలఁ బోలిన మొగమును వె
న్నెలఁ బోలిన హాసరుచియు ♦ నెఱిపసిఁడిగి
న్నెలఁ బోలిన కుచములు తి
న్నెలఁ బోలిన పిఱుఁదు లమర ♦ నెలఁతుక యొప్పున్.

వహ్వా,

సీ. కిసలయంబుల నెల్లఁ ♦ గ్రిందుసేయుచు దొండ, పండు దక్కఁ జేరు ♦ పసదలిర్చ
అరవిందములకన్న ♦ నందమ్ము గలవయ్యు, మీనులఁ బురడించు ♦ మిసిమి మెఱయ
విరిదమ్ములను గ్రిమ్ము ♦ సిరి జిమ్మువదియయ్యు, నెలబాలుఁ బోలియుంచు ♦ జిలుగు గులుక
వాణిముత్తె పుచేరు ♦ లణఁగఁ ద్రొక్కుచు నఖ్యగణములఁ దెగడెను ♦ కాంతి నెసఁగ

తే.గీ. నార యీతన్వి యధరంబు ♦ నతివ మోఁగము, వదనబింబంబు నఖరాజి ♦ ముదము నింప
వరలు నాభాగ్య మేమన ♦ వచ్చు నిట్టి, సుందరాంగిని జూడఁగంటిఁ ♦ జొక్కుచుంటి.

బాపురే! ఏమియీ చిత్రము! ఇదె మదయస్కాంతంబున భ్రాంతంబైనయట్లు నాహృదయం బీమించుబోణి రూపలావణ్యాతిశయంబులచే నెంతయు నాకర్షింపఁబడుచున్నయది. ఇట్టి తేజోరాశినుండి నామనంబు నెటుల మరలింపనేర్తును? ఓలలనాశిరోమణీ! నీవు రాజకన్యకవే యైనచో నిన్నుఁ దప్పక పెండ్లియాడెద.

మ. వనజాతాయతనేత్రి నీవు నవలా ♦ వణ్యాబ్ధివీచీవళిన్
దనివోకుండఁగ నోలలాడుచు నహో ♦ తన్వంగి నాచిత్త మా
ఘనమీనాంకశతఘ్నిగోళపటలిన్ ♦ గాసిల్లెడిన్ దేర్పలె
మ్మనుమానింపకు పీడియుంటివి వాదీ ♦ యాం బైన వైరాగ్యమున్.

ఈ కోమలాంగి యొంతగాఢనిద్రాపరవశురాలై యున్నయది!

ఉత్సాహ. కోమలాంగి! కోపమేల? ♦ కోరియుంటి నిన్ను నే
కామబాణజాలములకుఁ ♦ గాంత మోర్వఁజాలనే
భూమిలోన నిన్నుఁ బోలు పొలఁతి నెందుఁ గాన నే
మామకార్తి డింప లెమ్ము ♦ మానినీశిరోమణీ!

[అని నిద్రావస్థ నభినయించును.]

అయ్యో! ఇంతలోనే నన్నుపగజ్జైలతల్లి యావహించుచున్నది. ఇంక నెట్లోగదా! నా సర్వేంద్రియ వ్యాపారంబులును క్రమక్రమముగ మందీకృతంబు లగుచున్నవి. అయిన నీ నిద్రాదేవియు నా కొక యుపకారమే చేయుచున్నది. ఓ రమణీమణీ!

మ. అలివేణీ మృదుపాణి నీకు మహనీ • యం బైన తేజంబు నిం
పలరం జేయఁగఁ జూచ్చి తీవియల న • త్యంతంబుగాఁ బట్టి హృ
జ్జలజాంతర్గతమానటుల్లలిపి శ • శ్వత్ప్రౌఢి బంధించితిన్
వెలిబోకుండఁగ మోడ్తు నేత్రములఁ ద • ద్విద్యుత్స్వరూపం బికన్.

(అని గాఢనిద్రాముద్రితుఁడై మూర్ఛిల్లుచున్నాఁడు)

(అంత రోహిణి మేల్కొనుచున్నది.)

రోహి.—(చుబుకంబు నివురుకొనుచు లేచి) అబ్బా! నాచుబుకంబు నెద్దియో చుఱుక్కునఁ గుట్టినది. (అని వలుపక్కలు తేఱిపారఁ జూచి) ఆ! ఏమిది! ఈప్రదేశ మెంతయు వింతగఁ గాన్పించుచున్నది. అత్యద్భుతం బగు నీయపూర్వతేజం బెటనుండి ప్రజ్వలించుచున్నదో! ఇది యేమివింత. నే నిపు డెంతయు భయకంపిత చిత్తురాల నగుచుంటిని. (అని భయము నభినయించుచు నిద్రాకైతవంబున కనులను మోడ్చియు వెంటనే యులికిపడి లేచి) అయ్యో! ఏమిది!! ఈ దుష్టమదేందిందిరంబు లేల నన్నిట్లు వేధించుచుండె! ఎన్నఁడును జూడని యీవింతతుమ్మెదలు నేఁ డేలవచ్చె! ఇదంతయు నెద్దియో యొకమాయగా నున్నది. (అని యిటునటుఁ జూచి రాజకుమారుని వీక్షించి) ఓహో! ఏమి యీ మోహనాకారము!! ఈ మహనీయ తేజశ్శాలి యగు దివ్యపురుషుఁ డెవ్వరై యుండునో గదా! వైరాగ్యోపలసన్నిభంబైన నాచిత్త మీ మోహనాంగునిఁ జూచినతోడనే చలించుచున్నది. అనన్యగమ్యం బగు నిజాంతఃపురంబున హంసతూ

లికాతల్పంబుపై శయనించి నిద్రించుచుండ నెరు లెవ్వరు నా
హర్మ్యతలంబున కిట్లు రాఁగలిగిరి?

శా. ఓహోహో! కడుచిత్రమయ్యె నిది యే ♦ మో మాయగా నిట్టులన్
బాహాటంబుగ నీ నిశీథమున నా ♦ పజ్జం బ్రకాశించు నీ
సాహస్రాంశుసమానతేజుఁ డెవరో ♦ చర్చింప నాచిత్తమున్
మోహభ్రాంతినిఁ జెందఁ జేయ సఖు లీ ♦ మూర్ధన్యునిం దార్చిరో.

అటుగాక,

చ. నిలుకడఁ జెందు కొమ్మెఱుఁగొ ♦ నింగిఁ దొలంగిన చంద్రబింబమో
యలరులవింటివాఁడు తన ♦ యంగముఁ బూని వసించియుండెనో
కలఁ గనియుంటినో నిజము ♦ గా నలకూబరుఁడో జయంతుఁడో
వలపుల నెమ్మెకాఁడగు నృ ♦ పాలతనూజుఁడొ తోఁచ దహా!

తేజోరూపలావణ్యాతిశయంబుల నొప్పుచుండిన యీయనన్యసామాన్య
సుందరాంగునిమంతనంబున నా నెచ్చెలులే నాయొద్దకుఁ బంపిరి కాఁబోలు.
జననీ జనకులారా!

ఉ. ఈ నవమోహనాంగుఁడు మ ♦ హీవరపుత్రికుఁ డేని వీని నే
మానకఁ బెండ్లియాడెద హి ♦ మద్యుతి శైత్యము వీడియుండినన్
భానుఁడు చల్లనైనను న ♦ భంబు భువిం దలక్రిందునైన నా
మానసమందు నీతని య ♦ మానుష తేజము చిక్కెఁ గావునన్.

నా నెమ్మనమును హరించిన యీ రూపవిజితమన్మథాకారుని లేపెద.
(అని నిద్రాముద్రితుఁ డగు సుధాకరునిపైఁ దన కరపంకజంబు నునిచి

ఉ. ఓ యకళంక నీకు విను ♦ మోసుకుమారశరీర చిక్కితిన్
మాయలు చాలు నింక నను ♦ మాన నెటకింతయు లేదు నిన్ను నే
బాయఁగఁ జాలఁ బంతమునఁ ♦ బల్కవదేమిర కోప మెందు కో
కాయజరూప నీమదిని ♦ క్రౌర్యము డింపుము లెమ్ము చూడుమీ.

అన్నా! మనోహరా! నిద్రాదేవి నా శిరస్సుపై నెంతయుఁ దాం

డిపమాడుచున్నయది. ఇనుపగుండ్లుకట్టినట్లు నాకనుఱెప్పలు మూసికొని పోవుచున్నవి. ఇంక నెట్లో గదా! కానిమ్ము, యీ మోహనాంగుని సందర్శనజ్ఞాపకార్థము పీని కనకాంగుళీయంబును సంగ్రహించెద. (అని తనవ్రేలినున్న యుంగరము నాతని వ్రేలి నుంచి యాతని యుంగరముఁ దా గ్రహించి యెప్పటియట్ల పరుండి నిద్రించుచున్నది.)

[అంత మనోరంజనియు పుష్పదంతుఁడును నిజరూపములఁ బ్రవేశింతురు]

మనో—ప్రాణేశ్వరా! తెల్లవాఱకమున్నే మన మీకుటిలాలకను పరులెవ్వరికిని దెలియకుండునటుల రహస్యోచితంబుగఁ దిరుగఁ బాంచాలదేశంబునకుఁ గొనిపోయి యట నిజసౌధాంతరంబున నెప్పటియట్లఁ బరుండఁబెట్టి రావలయును. చూడుఁడు,

చ. తెల తెలవాఱుచుండె నని ♦ దీపపుకాంతులు తెల్పి చెప్పెడుం
గలయఁగఁ దెజ మబ్బె నని ♦ కాకులు కావని కూయుచుండె నిం
ఘులుగులుకంగ గాలి వల ♦ పుల్పచరించుచు వీచుచుండె ని
మ్ములఁ గలయంపి ప్రముగ్గులిడ ♦ బోఁటులు లేచుచునుండి రిప్పుడే.

పుష్ప—జాయా! ముఖ్యముగా మన మాటులనే జరిగించి వత్తము రమ్ము. (అని నిద్రించి విలియున్న కోమలాంగితో పాంచాలదేశమును గూర్చి ఖేచరులు నిష్క్రమించుచున్నారు.)

ఇది ద్వితీయాంకము.





శ్రీరస్తు.

# రోహిణీసుధాకరవిజయము.

## తృతీయాంకము.

ప్రథమరంగము—దక్షమహీపాలుని యాస్థానము.

[దక్షమహీపాలుండును మంత్రియగు మారుతియుఁ బ్రవేశించుచున్నారు]

దక్షు—అమాత్యపుంగవా ! నాకుమారీమణి యౌవనవతియై యున్నది. ఆమెకుఁ బరిణయ మొనర్పవలయును. ఆకన్యకాతిలకంబున కిచ్చువచ్చినవరుం డెట్లు లభించునో తెలియరాదు. యోగినీవ్రత మవలంబించి పరిణయపరాఙ్ముఖయై యున్న యామె చిత్తము నెట్లు మరలింతును?

మారు—దేవా ! మీదుహితృరత్నంబును మగధదేశాధిపతియగు రాజశేఖరున కొసంగ మీరిదివఱకే నిశ్చయించికొని యుంటిరి కదా, మీ రిపుడేల పునరాలోచనముం జేసెదరు? అదియునుఁ గాక స్వయంవరమును గూడఁ జాటించి యుంటిరి. దానిపర్యవసానముఁ జూచినపిదప కదా మఱియొక యోచనఁ జేయవలసినది.

[అంత నొకకంచుకి ప్రవేశించి.]

కంచు—దేవా! రాజశేఖరమహారాజుగారు దేవరవారిపేర నొక జాబు వ్రాయించి యిప్పించినారు చిత్తగింపుఁడు. (అనియుత్తరమును చేతికిచ్చుచున్నాఁడు.)

దత్తు—మారుతీ! ఈయుత్తర మేమియోచూతము. (అనియాలేఖను మంత్రిచేతికిచ్చుచున్నాఁడు.)

మారు—చిత్తము. (అనియుత్తరమునందుకొని చదువుచున్నాఁడు.)

సీ. శ్రీరాజమాన్యరా • జితపూజపాంచాల, దేశమహారాజ • తిలక మీకు
వందనంబులొసఁగి • వరమతి నేఁ దెల్పు, విషయంబులేమన • విస్తరింతు
మనుమీపుత్రియాత్మజన్ • ఘనముగామాకిచ్చి, పెండ్లిసేయుదుమంచుఁ • బేర్మిఁబలికి
తగవుసెంచక మీరు • తారత్నమునకు స్వ, యంవరంబును జాటు • నంపనగునె

తే.గీ. ప్రకటభుజవీర్యమేర్పడఁ • బార్థివులను, ఘోరరణరంగమందునఁ • గూల్చిపిదప
గడగిరాక్షసవైవాహి • కంబుచేతఁ, గన్యఁగొనియెద.

రాజశేఖరునివ్రాలు.

దత్తు—మారుతీ! రాజశేఖరుండు కుపితుండై యుండెనుకాఁబోలు. ఆతండు మనబలవద్విరోధియగు సింహళద్వీప రాజాధమునకుఁ దోడ్పడియెనేని రత్నాకరుండు మనకు దుస్సాధ్యుండయ్యెడు. ఇందులకుఁ బ్రత్యుపాయము నూహింపుము.

మారు—దేవా! మనమిపు డూహించుట కేమియున్నది. దేవరవారి కుమారీమణికి క్షత్రియధర్మానుసారముగ స్వయంవరమును జాటింప నొకరు కిఁకయేల? అయిన నారాజేంద్రుని సన్నిధికి రప్పించి శాంతిపఱచుటయే శ్రేయమని తోఁచెడు.

దత్తు—మంచిది. అటులనేచేయుదము. ఓరీ! కంచుకీ! మీరాజిపు డెటనున్నవాఁడు?

కంచు—దేవా, మారాజుగారిపు డీపట్టణములోనే యున్నారు.

దత్తు—అటులైన మారుతీ! నీవే స్వయముగఁబోయి యారాజేంద్రుని సన్నిధికిఁ దోడ్కొనిరమ్ము.

మారు—చిత్తము. (అనినిష్క్రమించి వెంటనే రాజశేఖరునితో ప్రవేశించుచున్నాఁడు.)

దక్షు—(దర్పూల రాజశేఖరునిఁగని) ఓహో! మిత్రమా రమ్ము. ఇటఁ గూర్చుండుము.

(అని యొకయున్నతాసనంబును జూపుచున్నాఁడు)

రాజ—(ఆసనము నధిష్ఠించక యే) రాజా! దక్షమహీధవా!

ఉ. భోగవిహారలీల పరి ♦ పూర్ణసుఖంబుల నొక్కపాత్రి నన్
బోఁగొను మృత్యుదేవతను ♦ పొల్పుగ రెండవపాత్రి నుంచఁగా
నూఁగెడు త్రాసు దానికి న ♦ యోన్నతచూపు నుముల్లు వైననీ
వేగతిఁజూపెదో తెలుపు ♦ మేర్పడనీహృదయంబు భూధవా.

దక్షు—రాజశేఖరా! నాకుమారీరత్నము పరమవైరాగ్యంబవలంబించి పరిణయపరాఙ్ముఖయై యున్నయది. ఆనారీమణి చిత్తమును పరిణయాయత్తం బగునటులఁ జేయుటకై నిఖిలదేశాధీశులను రావింపనట్టి యుపాయమును బన్నితినేగాని నిన్ను మఱచి కాదు.

రాజ—రాజా! వన్నెల మాయచేసెదవు. సర్వజ్ఞుండవగు నీవు కన్యకాజనంబు లెట్టివరుల వివాహమాడ నిచ్చగింతురో తెలియకుందువే. వినుము.

చ. కులము రూపమున్ గుణ మ ♦ కుంఠిత తేజము బాహువీర్యమున్
సలలితశీలమున్ సతత ♦ సత్యవచోరచనాకలాపమున్
విలసితసత్కళా కలిత ♦ విస్ఫురితకీర్తి విహారవైఖరిన్
గలిగి చరించు నవ్వరునిఁ ♦ గన్యక కోరు వివాహమాడఁగన్.

కావున,

ఉ. సొంపగు సత్కులంబునఁ బ్రి ♦ సూతినొసంగినవాఁడ ధారుణిన్
బెంపగు పేరు నొందిన వి ♦ వేకిని శూరుఁడ సత్యవంతుఁడన్
దెంపున వైరివర్గములఁ ♦ ద్రోళ్ళగఁ జేసితి నాజి నట్టినా
కింపుగు బెంప నీదుసుత ♦ నిమ్ము విశంకటవృత్తి భూవరా.



మఱియు,

క. క్షత్రియజాతుండవు నీ
పుత్రిక కును దగినవరుఁడ ♦ భూపాలక నే
సుత్రాముసన్నిభుండనఁ
బాత్రుఁ డనగు నాకు నీవు ♦ పట్టి నొసఁగుమీ.

దత్తు— రాజశేఖరా! నాకుమారీమణి పరోక్షంబున నే నెట్లు స్వతంత్రించి మాట నొసంగెద. ఆకన్నియ యెట్టివరు నిచ్ఛగించునో తెలియరాదు కదా.

రాజ— రాజా! నీ విట్లు సందేహించెదవు? చూడుము.

ఉ. నాదువిశాలనేత్రనలి ♦ నంబులు నాముఖచంద్రకాంతియున్
నాదుశరీరసౌరభము ♦ నామువిహారము నావిలాసమున్
నాదుమృగేంద్రవక్షమును ♦ నాఘనదీర్ఘభుజద్వయంబు స
మ్మోదముతోడఁ జూచినను ♦ మోహముఁ జెందరె యెట్టి కాంతలున్.

దత్తు— రాజశేఖరా! ఎట్లు నను స్త్రీలనిజాభిప్రాయంబుఁ గుత్తెఱుంగకయ వారలకుఁ బరిణయ ప్రయత్నంబు జేయఁజనదు. అందువలనఁ బిదప నెన్నియిక్కట్టులైనఁ గలిగెడు. ఇంతియెగాక, నాగారాబుపట్టి యసమానశేముషీవిశేష రాలు. కావున నామెను సామ్రాజ్యధురంధరుండవును సత్కులప్రసూతుండవును రూపనిర్జితమారుండవు నగు నీకొసగ నాకిచ్ఛ వొడమినను మదీయ కుమారీమణి హృదయంబు తెఱంగెఱుంగకయ నే నెట్లుసాహసించెద?

రాజ— రాజా! నీవు నాయెడల సుముఖుండవై యుండిన నదియచాలును. నేను పోయివచ్చెద. (అని రాజశేఖరుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

దత్తు—(కనుసైగచే మంత్రిని చేరంజీరి నాన్యాకర్ణనీయంబుగ) మారుతీ! నీవుకూడఁ బోయి రాజశేఖరుని పోకడ లరసిరమ్ము.

మారు—చిత్తము. (అని మారుతి నిష్క్రమించుచున్నాఁడు.)

[అంతనొక దౌవారికుఁడు ప్రవేశించి]

దౌవా—దేవా. నిన్న రేయి నర్ధనిశీథినీసమయంబున దేవరవారి కుమారీమణిహర్మ్యతలంబున కెవరో యొక దివ్యసుందర విగ్రహుండగు పురుషుఁడు వచ్చి పోయెనఁట. అందువలన నమ్మగారు భయభ్రాంతులై యవుడేమేమిటియో మైమఱచి యాక్రందించుచున్నారు. దేవరవారి కీసంగతి నివేదింప నే నిటు వచ్చితిని.

దత్తు—(అద్భుతకోపరసావేశపరవశుండై) ఆఁ! ఏమిది! నాముద్దులపట్టి హర్మ్యతలంబున కెవరిట్లు రాసాహసించిరి! (అని సవితర్కముగఁ దనలో) ఒకవేళ రాజశేఖరుండే కాఁడుగదా? అతం డీపట్టణమున కిదివఱకే వచ్చి యుండెనఁట. నాపట్టిహృదయంబును దనయెడల ననుకూలింపఁ జేయుటకై యిట్టి దుస్సాహస మొనరించి యుండెనేమో. అయిన నొకరిపైఁ దగునిదర్శనము లేకుండ వ్యర్థముగ నిరాపనిందలు మోపరాదు. ఆసంగతి యెట్టిదియో నేనే స్వయముగఁ బోయి కనుఁగొనివచ్చెద. ఏమిచెపుమా! అక్కడ పౌరులెందఱో గుంపులుకూడి మాట్లాడుకొనుచున్నారు. ఈవిషయమును గుఱించియే గాఁబోలు.

(అని దత్తుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

---

ద్వితీయరంగము—రాజవీథి.

[కామపాలుఁడను నొక పౌరుఁడు ప్రవేశించుచు]

కామ—ఆహా! ఏమియాచిత్రము! పరులెవ్వరికినిఁ జొరశక్యముగాని రాజకన్యాంతఃపురంబునకు సహితము చోరులు నిరర్గళముగ

వచ్చుచున్నారు. ఇంక మాకోట్లకుటీరనిలయంబు లిట్టి చోరభయగ్రస్తంబులు గాకుండ నెట్లుసురక్షితంబు లయ్యెడు? (మార్గమునఁ బోవుచుండు మఱియొక పౌరునింగాంచి) ఓహో! సుదంతా! ఏమీ నీవంత తొందరగాఁ బోవుచుంటివి? బాల్యస్నేహితుఁడనైన నావంకఁ గన్నెత్తి చూచుటకైనను వీలులేనంత దయతప్పినా?

సుదం—ఓహో! మిత్రమా కామపాలా నీవేనా? ఇప్పటికి నన్ను క్షమింపుము. నేనొక రాజకార్యసంబంధమగు తొందరపనిలో మునిఁగియుండుటచే నిన్నుఁగననేరనైతిని. నిన్న రేయి రాజకన్యాంతఃపురంబున జరిగిన యద్భుతచర్య లేమైన నీ వెఱుఁగుదువా?

కామ—మిత్రమా! రాజకన్యామణి చోరభయగ్రస్తురాలై యేమే మిటిరేయో మైమఱచి ప్రలాపించుచుండెనని మాత్ర మొకకింవదంతిపుట్టినది. అది యెంతవఱకు సత్యమో తెలియరాదు.

సుదం—మిత్రమా! ఆకింవదంతి నిశ్చయమే. మన రాజుగారి కొమరితయగు రోహిణీకన్య తనయేకాంతసౌధాంతరంబున హంసతూలికా తల్పంబుపై శయనించి నిద్రించుచుండ నెవరో మహాసౌందర్యశాలియగు నొకదివ్యపురుషుఁడువచ్చి కజ్జను బవళించెనని భ్రమించి పలవరించుచుండె.

కామ—(తనలో) ఆపురుషుం డతిసాహసుఁడైన యొకచోరుండే కావచ్చును. (ప్రకాశముగా) మిత్రమా, రాజకన్యాంతఃపురంబున నాసాహసునిచే ద్రవ్యముకాని భూషణంబులుకాని యేమియు హరింపఁ బడలేదు కదా?

సుదం—మిత్రమా! అట్టిపని యేమియుఁ జరుగలేదు. ఇంతియేగాక, యాపురుషుం డొక స్వప్నసంభవరూపుండే కాని నిజమైన చోరుండు కాఁడని తోఁచెడు. ఏమన,

మ. కమనీయాంచితరత్నకాంచనలస ◆ ద్గ్రైవేయహారావళుల్
విమలస్ఫూర్తినమూల్యవస్తుచయముల్ ◆ వేవేల ద్రవ్యంబు వి
ద్రుమసంకాశకలాపముల్విడిచి చో ◆ రుండైన రాజేంద్రు హ
ర్మ్యముననన్ రోహిణిహంసతూలికశయన్ ◆ రాజిల్లఁగాఁ బండునే.

కామ — సఖా! ఇదియంతయు స్వప్నభ్రాంతియేనా? ఇట్టియద్భుతచర్యవలన మనరాజుగారి కుమారి కొకకీడు పుట్టదుకదా?

సుదం — మిత్రమా! ఈవిపరీత మెన్నో కీడులనైన గలుగఁజేసినది. ఏమని చెప్పుదును. ఆమిథ్యాపురుషుని పజ్జనుజూచినట్లు భ్రమించినది మొదలు రోహిణీకన్య సంచలితచిత్తయై యసంబద్ధప్రలాపములను జేయుచున్నది. అట్టిదురవస్థ నొందియున్న నిజకుమారిం గాంచి మనరాజుగా రత్యంతచింతాకులస్వాంతులై యున్నారు.

కామ — అన్నా! ఎంతపనివచ్చెను. మిత్రమా, నీవిపు డెట్టి కార్యార్థమై పోవుచుంటివి?

సుదం — మనరాజుగారు తమప్రధానమంత్రియగు మారుతిని తక్షణమే వెంటఁబెట్టుకొనిరమ్మని నాకాజ్ఞాపించినారు. నే నామహీపాలుని యాజ్ఞానుసారంబుగఁ బోయి మంత్రిపుంగవు నాస్థానంబున కనిపి నేనుగూడ రాజభవనమును గూర్చియే పోవుచున్నాఁడను. అదిగో రాజభటుండగు జనమిత్రుఁ డిటులనే వచ్చుచున్నాఁడు. నేనుపోయివచ్చెద. (అని సుదంతుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

కామ — ఇంతటినుండియు మాగృహమును నేనతిజాగ్రత్తతోఁ గాపాడుకొనుచుండవలయును. మాయింటి యాబిడ యొంటిరిగ నుండెఁ గాఁబోలు. నేను శీఘ్రముగఁ బోవలెను. (అని కామపాలుఁడు నిష్క్రమించుచున్నాఁడు).

[అంత జనమిత్రుఁడు ప్రవేశించి]

జన- ఉ. ప్రీతిగఁ గన్నదక్షపృథి • వీపతి ముద్దులకూఁతు రెంతొ సం
జాతవికారచేష్టలను • జాలనటించెడు పీడఁజెంది, యో
భూతముఁదోలు నేర్పుగల • పుణ్యాభిమగ్యరులార వచ్చి మీ
ఖ్యాతినుతింపఁగాఁ దెలిపి • కారములం దయఁబాపిపొ్రవరే.

అని ప్రకటనఁజేయుచు నిఖిలదేశంబులం గ్రిమ్మరి యెందైన నొకభూతవై ద్యుని వరసి తోడ్కొనిరమ్మని పాంచాలదేశాధిపతియైన దక్ష మహారాజుగారు నా కాజ్ఞాపించియున్నారు. ఎంతతిరిగినను సమ ర్థుఁడగు వైద్యవరుఁడొక్కఁడును గానరాఁడయ్యె. ఏమిచేయుదును. అబ్బా! నేనింక సంచరింపఁజాలను. (అనిచతికిలంబడి యూపిరివిపు లముగ విడుచుచు) అన్నన్నా! అధికపథశ్రమఁబుచే నాకాళ్లింతయు నొప్పిపెట్టుచున్నవి. హా మాయదైవమా ! అట్టిగుణఖనియగు ధరారమణుని గారాబుతనయ కిట్టికురవస్థను గలుగఁజేసి నిజ పరితాపపరిభావటలపరంతపుం డనందగు నామహీకాంతున కిం కొంత నొకదానిం గల్పించి దుఃఖార్ణవనిమగ్నునిగఁ జేసి నంతఁ గుందింపుచు మమ్ముల నీలాగు త్రిమ్మఁబెట్టుచుంటివి కదా. ఇంక నేనెక్కడికని తిరిగెదను. అదిగో దవ్వుల నొకబాటసారీలాగు ననే వచ్చుచున్నాఁడు. భూతవైద్యుని గుఱించి వానికేమైనఁ దెలియునేమో కనుఁగొనియెద. (అని లేచి ముందుకు నడుచు చుండ బాటసారి ప్రవేశించుచున్నాఁడు).

బాట—ఏమోయి రాజభటుఁడా, నీవు చేయుపాటింప దేమని? నీ ముఖ చర్యఁజూడ నేఁడెద్ది యో యొక విపరీతము తటస్థింప దానికై నీవు మితిలేని విచారమును బెందియున్నట్లు దోఁచుచున్నది. సంగతియెట్టిదియో వివరింపుము.

రా. భ—పాంథా, ఏమని చెప్పుదును. పాంచాలదేశాధిపతియైన దక్ష
మహీపాలునకు లేక లేక నొకకుమారీతిలకం బుదయించి యక్క
న్నియ శుక్లపక్షచంద్రికవలె దినదిన ప్రవర్ధమానయై విలసిల్లి
యిప్పుడొక పీడఁజెంది కృష్ణపక్షసుధాంశురుచివలె కాంతివిహీ
నయై గాసిల్లుచున్నయది. ఆయొలనాగపీడను దొలఁగింప సమర్థుం
డగు భూతవైద్యుని వరయ నేనిట్లు చాటించుచున్నాఁడను. అట్టి
వైద్యవరుఁ డొండైన నీకు గోచరుండయ్యెనేని నాకుఁ దెలిపి
పుణ్యముఁ గట్టుకొమ్ము.

బాట—(స్వగతము) అన్నా, ఎంతపని జరిగెను. కానిమ్ము. నేను సమ
యమునకే వచ్చితిని. అయినను దీనిసంగతి సకృత్స్నముఁ గనుం
గొనిన పిమ్మటగాని యందులకుందగిన సాధనోపాయంబును వి
చారింపవలనుపడదు. (ప్రకాశముగా) రాజభటుఁడా, పీడఁజెంది
యున్న యా రాజబింబాస్య వికారచేష్ట లెట్టివియో నీకుం దెలిసి
యుండిన వాని నెల్ల నాకు తేటఁబఱపుము. పిమ్మట వైద్యుని జాడ
నీకుఁ దెలిపెద.

రా. భ—(తనలో) వహ్వా, ఈతండొక భూతవైద్యునివలెనే దోఁచు
చున్నాఁడు. ఇంక నాశ్రమనివారణ కానైయున్నది కాఁబోలు.
(ప్రకాశముగా) పాంథా, తెల్పెద వినుము.

ఉ. ఆనరపాలపుత్రి యహహా ♦ హా నిజశయ్యను జేరి బోతుటీఁ
గైనను జేరరాని తన ♦ యంతిపురంబున నిద్రఁజొరఁ దే
జోనలినాప్తుఁడైన యొక ♦ సుందర రాజకుమారుఁ డేగి యా
మానినికజ్జఁ బండెనట ♦ మాట లికేటికి చిత్రమయ్యెడిన్.

అట్టిస్వప్నసంభూతుఁడగు మిథ్యారాకొమరునిపై మరులుగొని నిజపరి
చిత వినోదంబులం దగులక యంచువిలుకానిచేతి బంతియో
యనునట్లు నాటిమాటికి మైమఱచి తుళ్ళుచు—

మ. తలయూచున్ దవగోనఁ దాఁవ నగు సం ♦ తాపించు లో నూఅకే
బయిరుక్ జెక్కిటచెయ్యి జేర్చు సఖుర్ ♦ బల్మారుదూఱుక్ బయల్
గలయక్ గాఁగిటఁ జేర్చు నల్గడల వీ ♦ క్షక్ జూచు మైసొమ్ములన్
వెలిదీయున్ బెదరున్ గలంగు వలువన్ ♦ వేమారు దూషించెడున్.

మే మెవ్వర మేని చేరంజన నాకృశోదరి తటాలున శయ్యపైనుండి లేచి మేఘగర్జనగంభీర భాషణంబుల నేమేమిటియో మైమఱచి పేల్చుచుండు. ఈవికారచేష్టలంగాంచి పలువురు పలువిధంబులుగా నుడువ రాజుగారా కోమలాంగికి పీడసోఁకెనని తలంచి యెందఱో భూతవైద్యుల రప్పించిరే కాని వారివలన సార్థక్య మేమియు లేకపోయె. కావున,

చ. తిరిగితి నెల్లచోటులకుఁ ♦ దెల్పితి భూధవునాజ్ఞ యెంతసేఁ
దిరిగిన నొక్కవైద్యుఁడు ను ♦ దిన్ దిలకింపఁగ గానరాఁ డికే
వెరవున బోవనేర్తు బ్రతి ♦ పీవరుచెంగట నెట్టివిన్నపం
బిరవుగఁ జేయుకున్ బిమఁజు ♦ డెక్కడదుంకును తెల్పుమీ నయున్.

బాట.—(ఆ గాశము వంకఁ జూచి తలపంకించుచుఁ దనలో) ఆఁ! దీనికారణము కొంత నాకు హృద్గోచరంబైనది. అయిన నే నాకోమలాంగిఁగని స్వయముగ సభాషించినంగాని యున్న యథార్థకథనంబు తేటఁబడదు. (ప్రకాశముగా) రాజభటుఁడా! నీవుకోరిన కోరిక నేనే నెఱవేర్చెదను. నాకు భూతవైద్యమునందు కొంత పరిశ్రమ కలదు. ఆసరోజాక్షియొద్దకు రహస్యోచితంబుగ నీవు నన్నుఁ దోడ్కొనిపోఁగలిగితివేని నే నాపిశాచంబును ముహూర్తమాత్రములో నివారణ చేసెద.

రా. భ.—పాంథా, రాజవనితలు నివసించియుండు రాజాంతఃపురంబులకుఁ బరపురుషుల నెట్లుఁ జేర్పనగు? ఇంతియె కాక మేలుకీసు

లతోఁ గూడికొనిన యీపనిలోఁ బ్రవేశించి నిగ్రహించు టెంతయు దుర్ఘటము. రాజుగారి శాసన మెట్టిదియో నీవెఱుంగుదువా?

చాట—ఎఱుంగను. అదెట్టిదియో తెల్పుము.

రా-భ—వినుము.

చ. ముదముగ నాథరాధిపుని ♦ ముద్దులగూఁతు వికారచేష్టలన్
గుదురుగఁ జేయఁగాఁ గడగి ♦ కోరికతో నర వేర్చువానికిన్
సదయత నర్ధరాజ్యము నొ ♦ సంగుదురంట కుదుర్పకుండినన్
దుది దయలేకఁ దచ్ఛిరముఁ ♦ ద్రుంచెదరంట నికేమిచెప్పుదున్.

పాంథా! ఈశాసనము మిథ్యాప్రగల్భ్యులగు వైద్యవేషుల నిదివఱ కెందఱినో బలిపుచ్చుకున్నది. కావున నీవవిచారుండవై మొండిచొరవఁ జేయకుము.

చాట—రాజభటుఁడా! ఆవిషయమై నీవెంతమాత్రమును సంకోచింపవలసిన పనిలేదు. ఈలాటివ్యాధుల నెన్నియో నే నిదివఱలోఁ గుదిర్చి యున్నవాఁడ. ఇట్టివానికిందగు చికిత్సలన్నియు నే నెఱుంగుదును. రాజకన్యాంతఃపురంబునకు నన్నుబ్రత్యేకించి రహస్యోచితంబుగఁ దోడ్కొనిపోవుటకు సందేహించితివేని రాజుగారి సముఖమునకు నేనే స్వయముగఁ బోయెద.

రా-భ—అటులైన వైద్యతిలకమా! శీఘ్రముగఁ బోవుదము రమ్ము. రాజుగారు మనరాకకై యెదురుచూచుచుందురు.

చాట—రాజభటుఁడా! నీవు ముందు నడుచుచుండుము. నే నీప్రాంతంబునంగల యొకవనమూలికను సంగ్రహించి నీవెనువెంట నేవచ్చెదను. కాని మీరాజుగారి సౌధరాజం బెటనుండెనో నా కానవాలుమాత్రము చెప్పిపొమ్ము.

రా-భ—భిషగ్వరా! నీ వీమార్గమున నేగినచో దవ్వుల నొకపుష్ప వాటికం గాంచెదవు. దానినతిక్రమింపఁ గననగు నత్యున్నతప్రాకారగభీరపరిఘావిరాజితంబై చుంబితనభోభాగగోపురాట్టాలకశోభాభిరామంబై వెలయు మేడయే మా రాజుగారిదని తెలిసికొనుము. నీవు తడవు సేయక శీఘ్రముగ రావలయుఁ జుమీ. నేను పోయివచ్చెద. (అని రాజభటుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

బాట—(స్వగతము) రాజభటుఁడు చెప్పిన చొప్పును బట్టి యోజింపఁగా నారాజబింబాస్యకు నిజమైన విరహవేదనయే వాటిల్లెనని తోఁచుచున్నది. అన్నా! ఇదివఱకెంతటి మోహనమూర్తులను దీసికొనివచ్చికనఁబఱచినను చలింపని యావనితా శిరోమణిచిత్తమును నేఁ డింతగ భ్రమింపఁ జేసిన మహానుభావుఁ డెవఁడై యుండునో తెలియరాదు. సింహళద్వీపభూపాలుని పుత్రుండు నిటులనే యర్ధరాత్రమునఁ దనపజ్జ నెవరో యొక మోహనాంగి పవళించియుండి తెల్లవారినతోడనే యదృశ్యయైనట్లు భ్రమించి యామెకై మితిలేనివిరహపరితాపంబు నొందుచున్నట్లు ప్రాంతంబున నొక కింవదంతిగలదు. ఆతండే యీమోహనాంగి విరహవేదనలకుఁ గారణభూతుఁడు కాఁడుగదా! అటులైనచో దారుణశాత్రవాపత్యంబులైన నాయిరువురకుఁ బరస్పరసంఘటనంబు దుర్లభంబు. ఎట్లయినను తొందరపడి నేనిపుడేమియు నిశ్చయింపరాదు. (అని నిష్క్రమించును.)

---

## తృతీయరంగము.

[దక్షమహారాజు మంత్రియైన మారుతియుఁ బ్రవేశించుచున్నారు.]

దక్షు—మారుతీ! అపారమైన యీవిచారసాగరంబును దరియింపనెద్దియే నొకయుపాయమును దెల్పుము.

మ. అలయక దేహరోగమున ♦ నట్టిచికిత్స లొనర్చియుంటి నం
కిలియున మొక్కికుంటి నర ♦ కేసరి కెంతయు బత్తితోడ నా
యలికులవేణి కూఁతున కి ♦ వన్నియు వ్యర్థములయ్యెఁ జేతితోఁ
గలిపినయట్ల మానసము ♦ కంది కలంగెడు నేమిసేయుదున్.

మంత్రిపుంగవా! నాకుమారీరత్నము వట్టిమిథ్యాసునో భ్రాంతిచేత నేనవయుచుండె. ఈభ్రాంతిని నే నెట్లుఁ బోఁగొట్టఁ గలిగెదనో కదా!

మార—నృపశేఖరా! విచారపడిన లాభమేమి? మానుష ప్రయత్నములచేఁ జేయఁదగిన పనులన్నియు దేవరవారు చేయించుచునేయుంటిరి. అయినను, కార్యకారణ కర్తయైన పరమేశ్వరుని కటాక్షముండవలయునే గాని లేనిచో మనుష్యమాత్రులమగు మనవలన నేమియయ్యెడు? మీర లూరక సంతాపించుటవలన సార్థక్యము లేదు. తగుప్రయత్నముల నింకను విసువక చేయించుచుండవలెను. మఱియు,

మ. వినుమీ రాజవరేణ్య! మానవుఁడు పృ♦థ్విన్ దాస్వతంత్రుండునై
తనమాయ న్విడ ద్రోయఁజాలఁడు తను ♦ త్పత్తిస్థితివ్యాప్తినా
శనకృత్యాశ్రియుఁ డీశ్వరుం డతనిచే ♦ సత్యంబుగాఁ దాను మో
హనిబద్ధుండయి కష్టసౌఖ్యభయమి♦థ్యాభ్రాంతులం బొందెడున్.

దేవా! రజస్తమోగుణంబులను పాశంబులచే బంధింపంబడి మనము ముక్కుత్రాటిచే పశువు మనుష్యులకు వశంబైన చందంబున నీశ్వరాజ్ఞాయత్తులమై ప్రవర్తించుచున్నారము. అంతియకాని మనకొక స్వాతంత్ర్యంబుకలదే? అయినను మాయామోహితులమై యుండుటవలన 'నోరుగాలిలో దీపముపెట్టి స్వామీ నీమహిమఁజూపు" మనినలాభము లేదనియెంచి దేవరవారి కుమారికారత్నంబునకు పైశాచికపుపీడ కలిగియుండెనేమోయని తలంచి మీయాజ్ఞగా భూతవైద్యులరయఁ దిరుగ చారులను బంపించియున్నాఁడను.

[అంత నొక ఫణిహారి ప్రవేశించి]

ఫణి—దేవా!

ఉ. భిక్షుఁడొ యక్షుఁడో వికృత ♦ వేషముఁ దాల్చి హజారమందుఁ దా
దక్షతఁ జూపఁ గుంకుమను ♦ దద్దయు మెత్తి విభూతిఁ బూసి రు
ద్రాక్షల పేరు లెంతయు శి ♦ రంబునఁ గంఠమునందు వ్రేల నో
రక్షక! భూతవైద్యుఁడట ♦ రా మదిఁ గోరుచునుండె నాజ్ఞయే.

దక్షు—మంత్రిపుంగవా! వైద్యములన నామనంబున కెంతయు విసుపు తోఁచుచున్నయది. ఇదివఱ కెంతమంది వైద్యులు బేలలై యత్యంత ప్రోత్కర్షలఁ బ్రకటింపుచుఁ గుదిర్చెదమని పూని తుదకుఁ గుదర్పలేక తమ ప్రాణములం గోలుపోయిరి? కావున బలాత్కారముగ జీవహింసఁ జేయుటయే కాని యింక నీవైద్యములతోఁ బ్రయోజనమేమియు లేదని తలంచెద.

మారు—దేవా! అట్లననేల. ఏమహానీయుని ప్రభావ మెట్టిదియో మన మెఱుఁగఁజాలము. ఏపుట్టలో నేపాముండునో మనకుఁ దెలియవచ్చునే? దేవరవారి కఠినశాసనమును వినియుండియు దాని ఫలము ననుభవించినవారిం గనియుండియు నిజమైన ప్రజ్ఞ లేనిచో నిటుల రా సాహసించునే? మఱియు,

ఉ. పోఁడిమి నల్పమానవులె ♦ పూని యొనర్చెదు గొప్పకార్యముల్
వాడిమిఁ జూప నీతఁ డిటు ♦ వచ్చెను లోనికి రా ననుజ్ఞ మీ
రోడక యియ్యఁగావలయు ♦ నో నృప! యోడలు బండ్లవచ్చు బం
డ్లోడలవచ్చు నట్లనుట ♦ యొప్పును నెప్పటి కేది కల్గునో.

దక్షు—మారుతీ! అటులైన నా వైద్యుని మా యెదుటకు శీఘ్రంబ రప్పింపుము.

మారు—చిత్తము. (అని కనుసన్నఁ జేయ ఫణిహారి నిష్క్రమించి వెంటనే వైద్యునితో తిరుగఁ బ్రవేశించుచున్నాఁడు.)

వైద్యు—(రాజును సమీపించి యథోచితగౌరవంబులం జరిపి) మహారాజా! దేవరవారి కుమారీమణి కొకపిశాచ సోఁకినదని విని నా భైషజ్య పరీక్షను ప్రభువులైన తమ మెకుటఁ దేటతెల్లంబుగ వెల్లడించి మీ కుమార్తెరత్నంబునకు సౌఖ్యమును గలుగఁజేసి మిమ్మును సంతోషపెట్టవలయునని యిచ్చపుట్టి వచ్చియున్నాఁడను. దేవా! ఆజ్ఞ సెలవిండు.

దక్షు—ఓయి భిషగ్వరా! మా శాసనంబులన్నియు నీ వెఱుఁగుదువా?

వైద్యు—చిత్తము దేవా! దేవరవారి శాసనంబులలో నే నెఱుంగని దొక్కటియును లేదు.

దక్షు—వైద్యుఁడా! ప్రాణహానిఁ దెచ్చెడు నీపనిలోఁ బ్రవేశించు టంతయు నాత్మహత్యకై పూనుటవంటిది. కేవల మాశాపిశాచంబుచేఁ బట్టువడితి వేని కీడు వాటిల్లెను. కావున నీవు బాగుగ యోజించికొనుము.

వైద్యు—మహారాజా! ఇట్టి ప్రాణోపద్రవకరమైన పనిని నెఱవేర్చుటకై నిజసత్త్వ మెఱుంగకయు బేలనై సాహసింతునే? దేవరవారు కేవలము భూతదయాశిస్వరూపు లగుటచే నింతదూరము సెలవిచ్చుచున్నారు. కాని నా సామర్థ్యమునందు నాకు దృఢమైన నమ్మకము కలదు వినుఁడు.

చ. ఇలఁగల వైద్యతంత్రముల • నెన్నియొ నేర్చితిఁ బ్రజ్ఞమీఱ ని
ర్మలమతి నాఁట సర్వజన • మాన్యుఁడనై విలసిల్లుచుంటి రో
గుల ముఱుమున్న యొందఱిని • కూరిమి సౌఖ్యమునందఁ జేసి యు
జ్జ్వలతరకీర్తిఁ గాంచితిని • జాంప్రసిద్ధిం జెందితిన్ నృపా.

మఱియు,

చ. నిను నిజశక్తి నే నెఱుఁగ • నేరక గొల్వఁగ రాను కార్య మే
నొనరఁగఁ జేసెదన్ బ్రతికి • యుండినచో బలుసాకులైన నే

దీని బ్రతుకంగవచ్చుఁ గడ ♦ తేరిన నిమ్మహి నేను జన్మము
దినఫల మేమి? ప్రాణములు ♦ లీపికదా భువి నెట్టివారికిన్.

నా సామర్థ్యముఁ దెల్పెద వినుండు.

సీ. దేహజాడ్యంబైన ♦ దివ్యౌషధంబులఁ, బోయక దానిఁ బోఁపంగ నేర్తు
పీడసోఁకినఁగాంచి ♦ వేవేగ మంత్రితం, త్రిమ్ముల నాబాధఁ ♦ దలఁగ నేర్తు
మతి చంచలించిన ♦ మానకఁదగు చికి, త్సల దాని బాగుగా ♦ సలుప నేర్తు
విరహాబ్ధిమగ్నులై ♦ వెతలఁ జెందుచునున్న, దవిలి నాథునిఁదెచ్చి ♦ తనుప నేర్తుఁ
తే.గీ. గాక నింకెట్టికతమునఁ ♦ గలికి వగల, బెగిలి నవయుచునున్న నా ♦ బింక మొప్ప
తగునుపాయంబు ఘటియించి ♦ తన్నివృత్తిఁ, జేసి మిము సంతసిల్లఁగాఁ ♦ జేయ నేర్తు.

దేవా! నాప్రాగల్భ్యము విషయమై తమ రింతమాత్రమును సంశయింపవలసిన పని లేదు.

దత్తు — వైద్యతిలకమా! నీ నివాసం బెటనుండు? నీ నామంబెద్ది? నీ కులగోత్రము లెట్టివి? సమగ్రముగ వర్ణింపుము.

వైద్యు — దేవా నాకు నివాసస్థల మనన వేఱొకటి లేదు.

ఉ. పండినచోటఁ బండకయుఁ ♦ బానము ద్రావినచోటఁ ద్రావఁగా
నుండక మొండవానలకు ♦ నోర్చి, యరణ్యనదీనదంబులన్
దండిగ దాటిదాటి కడు ♦ ధైర్యముతో పురిదుర్గసీమలన్
గొండికనాఁటనుండియును ♦ గ్రుమ్మరుచుంటిని నేను భూధవా.
తే. గీ. వినుము సర్వంసహాధీశ ♦ విశ్రుతముగ
నవనిజనులను పీడించు ♦ నట్టిరోగ
దమనుఁడన నొప్పుచుండుటఁ ♦ దనరు నాకు
దమనుఁ డనునామధేయంబు ♦ తథ్యముగను.

ఉ. కులమును గోత్రమెట్టిదని ♦ కోరఁగనేల మదీయదార్ఢ్యమే
దెలిపెడు నేను దేశముల ♦ ద్రిమ్మరినై చరియించుచుండి మీ
కలికియవస్థఁ జూచి యుప ♦ కారముఁ జేయఁదలంచి వచ్చితిన్
బలుకులికేల నాప్రతిభఁ ♦ బార్థివ మీరలె చిత్తగింపుఁడీ.

దత్తు—వైద్యుఁడా! నీకు వైద్యమునందు నిజమైన ప్రజ్ఞ కలదేని నా ముద్దుంపట్టి బుద్ధిని దిద్దుపఱచి మాయొద్దఁ దద్దయు బహుమతు లందుము.

దమ—చిత్తము, మహారాజా! (అని దమనుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

దత్తు—మారుతీ! ఇప్పుడు మనయొద్దకు వచ్చిన వైద్యుఁడు నా ముద్దులగున్న వ్యాధిని నివారణఁ జేయఁగలఁ డనుధైర్యము నీకుఁ గలదా?

మారు—దేవా! ఈ వైద్యతిలకుని ప్రభావ మనన్యసామాన్యంబని యే యూహించెద. ఏమన, దేవరవారి శాసనఫలానుభవము సోఁకినది మొద లిప్పటివఱకు నీతం డుదక్క వేఱొండు వైద్యుఁ డిట్లు దర్పమును జూపి చలింపని హృదయముతోఁ గుదిర్చెద నని దృఢముగ వక్కాణింపఁ గలిగనే? ఇదియునుఁగాక,

మ. గణనాతీతము లైన తంత్రములనే ♦ కంబు ల్గ్రహింపం గల్గఁ ద
ద్గుణదోషంబుల నెన్నఁజాలుకుమె ము♦కున్? గాక ముం జేతికం
కణము గాంచఁగ నద్దమేల? నిపుడే ♦ గానంగ నాదంభభా
షణయాథార్థ్యములన్ని స్పష్టమగు నో ♦ సర్వంసహాధీశ్వరా.

మఱియు,

తే. గీ. పూర్వభవసంచితప్రకర్మ ♦ పుంజ మిలను
నరయఁ బరిపక్వమైనచో ♦ నరుల కెట్టి
కష్టము ల్గల్గినను బాయఁ ♦ గాన కర్మ
ఫణితి నే యుండు వైద్యుని ♦ ప్రాభవంబు.

దత్తు—మంత్రిపుంగవా! మట్టిపిల్లియైనను మానిపిల్లియైనను నెలుకను బట్టుటయే ప్రధానము. ఇంక నీవు నీపనిమీఁద నుండుము

అంతఃపురంబున నేమి జరుగుచుండెనో చూచి వచ్చెద. (అని దక్షమహారాజు నిష్క్రమించుచున్నాఁడు).

మారు—ఈవైద్యుని గతి యెట్లయ్యెడునో తెలియరాదు. (అని మారుతి నిష్క్రమించుచున్నాఁడు.)

---

తురీయరంగము—రాజాంతఃపురము.

[అంతఃపురవర్తులగు వకుళ మాధవు లనుచెలికత్తియ లిద్దఱు ప్రవేశించుచున్నారు.]

వకు—అక్కా! మన రోహిణి యెట్టికష్టముల పాలయ్యెనే! మనతో బహూల్లాసముగా విహరించెడు కీరవాణి యెంతమిథ్యామనోభ్రాంతిచే పరితపించుచుండెనే! ఆనెచ్చెలి దురవస్థఁ జూచి నే నెంతయుఁ జాలిల్లుచున్నదానను.

చ. కలఁగవిసట్టినాథుఁ గన • గాసిలి నాయకరత్నశూన్యమై
యలరెడు హారవల్లరికి • యట్ల, హరిణాంకుఁడు లేనిరాత్రియుం
బలె, రవిదీప్తికై నవయు • పద్మినిచాడ్పున వంత.గుంది వ
త్రిలు మన రోహిణీరమణి • దీనతఁ దాంతలతాంతమో యనన్.

మఱియు,

చ. కనులరమోడ్చి యుండి కర • కంజముఁ జెక్కిటఁ జేర్చి యూరకే
వనటను వెచ్చనూర్చుచు న • పారవిచారకృశాంగియైన యా
వనజదళాయతాక్షి దుర • వస్థఁ దలంచిన నేమిచెప్ప నె
మ్మనమున సర్వము న్మఱచె • మానవనాథసుతే కరం బిరన్.

మాధ—సఖీ! మనరోహిణికి నిజముగా నే మతి చలించినదని యూహించెదవా యేమి? ఆ యాలాపములన్నియు నీ కసంబద్ధప్రలాపములని తోఁచుచున్నవి కాఁబోలు. కాని యావిలాపములకుఁ దగిన కారణము నే నెఱుఁగుదు. ఆవింబుబోఁడి యొక రాకా

మానసిపై మరులుగొని విరహార్తిచేఁ గృశియించుచుండె. ఏమన నీ వాకాంత కలలోఁ గనినట్లు భ్రమించిన దను రాకొమరుండు మిథ్యాపురుషుండు గాక నిజమైనమానవుఁడె యైయుండవచ్చును. మనరోహిణీకాంత యాభూకాంత తనూజుని నిజముగానే చూచి మోహించి యుండవచ్చును. కానిచో,

ఉ. కేలను వీణఁ బూని మణి ♦ కింకిణినూపురతారహారముల్
జాలఁగ ఘుల్ఘుఘుల్ఘుమనఁ ♦ జక్కఁగ మీటుచుఁ బాడునట్టి యా
బాలశశాంకఫాల పరి ♦ పాటిఁ దొలంగి మనోజరాగలీ
లాలసచిత్తయై నృపల ♦ లామునిఁ గూర్చి తపించుచుండునే.

కావుననే కదా,

చ. తన విలుఁ బూనుచున్ రుచులఁ ♦ దద్దయుఁ గల్గఁగఁ జేసి నారిచా
లనమున భ్రాంతులన్ గొలిపి ♦ లాలితపుష్పచయాంబకంబులన్
మనమును నొవ్వఁ జేయుచును ♦ మన్మథుఁ డాత్మవిలాసలీలలన్
వనజదళాక్షి వింతవల ♦ వంతలఁ జిక్కులఁ జేయు నో చెలీ.

పరు—అక్కా! నీ కట్టిసమ్మతి యెట్లుగలిగెనో తెలియరాకున్నది. పరులకుఁ జొరశక్యముగాని యాకాంత యేకాంతసౌధాంతరంబున కన్యపురుషుండు రాఁజాలునే? చాలు, చాలు. నీకుఁగూడ మతి పోవుచున్నదా యేమి? ఇదివఱలో నెంతమంది మోహనాకారులను తీసికొనివచ్చి కనఁబఱచినను చలింపని యాసరోజాక్షి చిత్తమును నేఁ డెవ్వరు భ్రమింపఁజేయనోపె? ఇదియునుఁ గాక.

ఉ. ఎక్కడి రాకొమారుఁ డతఁ ♦ డెక్కడినుండి యిటవచ్చె వచ్చి యా
పక్కను నెట్లుబండె చెలి ♦ పండిన నెట్టుల నూరకుండె న
మ్మక్కరొ! యేటిమాట లిటు ♦ వాడెదు? పరికింపఁగ నిట్టిచోద్య మిం
కెక్కడనైనఁ గంటివె మహీస్థలి వింటివె యన్న మాధవీ.

మాధ—(చిఱునవ్వుతో) చెలీ! వినుము. ఆయిందువదన తన డెందంబునం గలవలపును గుప్తము చేసికొని నేఁటికి నిజానురాగనిదానుండగు నొక మానవేంద్రతనూజునిం బొడఁగాంచి మోహాగ్నితాపంబు నొందుచున్నయది. ఇదియునుఁగాక ఖేచరుల మాయావిహారవైచిత్ర్యంబుల నీ వెఱుఁగవే? మనరోహిణీ కన్య యతి సౌందర్యవంతురాలు కదా. ఆమె యాలాపములను బట్టిచూడ నామె మనోహరుఁ డంతకంటెను మిగుల సౌందర్యశాలియని నే నూహించెద. చెలీ! ఏమి నీవట్లు తల పంకించెదవు.

వకు—మఱేమియు లేదు. అక్కా! ఖేచరుల మాయావిహారవైచిత్ర్యంబులకు వీరల సౌందర్యవిశేషంబులకు సంబంధ మేమున్నదే! సుందరులగు మందయానలందఱు నిట్టి దురవస్థం జెందుచుండిరే; ఇంక నీయుక్తులు చాలింపుము.

మాధ—ఎంతముద్దరాలవే నెచ్చెలీ! సౌందర్యవంతులగు స్త్రీపురుషుల నొకచోఁ గూర్చుటయుఁ బిమ్మట నెడఁబాపుటయు ఖేచరుల లీలలని మనము వినుచుండుట లేదఁటే? ఇట్టికారణ మేదైన లేనిచో నాచిలుకలకొలికి చిటికినవ్రేలిపై పురుషుఁడు ధరించు నుంగర ముండుటకుఁ గారణ మేమైయుండునో నీవే యూహింపుము.

వకు—ఏమోనమ్మా, నా కేమియుఁ దెలియదు. ఇదియంతయు నొక మాయగా నున్నది. అదిగో మనరోహిణియు మణిమంజరితో నిటులనే వచ్చుచున్నది. చూడుము.

ఉ. తమ్ములు ముత్యముల్ గనువి ♦ ధమ్మునఁ గన్నులనీరు జారఁగాఁ
దమ్మిద లేపు రేగనని ♦ దోఁపఁగఁ గొప్పును వీడఁ గల్వలన్

గ్రమ్మను మంచుబిందువుల • జైవడి లేజెమటల్ జనింపఁగఁ
గొమ్మరొ కంటె రోహిణియుఁ • గోపముతో నిటువచ్చుచుండెడున్.

[అంత రోహిణి ప్రవేశించుచున్నది ]

రోహి—

ఉ. హా సుమబాణ! హా చతుర! • హా సుకుమారశరీర! హా నృపా!
హా సరసీరుహాక్ష! విర • హానలకీలలఁ ద్రోచి యిట్లు నన్
మోసముజేసి పోఁజనునె • మోహనరూప! తపించుచుంటి నీ
వేసట క్రోధ్వఁజాల నిఁక • వేగమె రాఁగదవే మనోహరా!

హా! క్రూరకర్ములారా! పాపాత్ములారా! మోహనమూర్తియు నా మనోహరుండు నగు నరపాలతనూజుని నాయొద్ద కనిపినవా రెవరు? పిమ్మట నాహిమధామసన్నిభుని నన్నెడఁబాయఁజేసిన ద్రోహు లెవరు? అయ్యయ్యో, నే మతిపోయి యేమింటిమో ప్రేలుచుంటినని వీరందఱు భయపడి తొలంగిపోవుచున్నారు. అన్నా! నే నెంతమందభాగ్యురాల నైతిని! హా! నామనోనాథా! నీవుగూడ నిట్లు దయఁబీడి కనుమొఱంగి నన్నలయింపఁ జేయుట న్యాయమేనా? అహహా! అట్టి దాక్షిణ్యభావుండవును సూదరాకారుండవు నగు నీ కిట్టిక్రౌర్యగుణ కళంకం బెట్లుగలిగెనో తెలియరాదు. హా! భగవానుఁడా! కామదేవా!

మాధ—చెలీ! నీ విట్లు స్వప్నపురుషునికై పలవించిన నేమిలాభమే?

రోహి—అయ్యో, ఏమిచెప్పుదును? (అని నిట్టూర్పు విడుచుచున్నది.)

మాధ—సఖులారా, ఈ మన నెచ్చెలి విరహజ్వరంబుచేఁ బీడింపఁబడుచున్నది. ఈమెకు శైత్యోపచారములను జేయవలసియున్నది. కావున, కలువ రేకులను తామరతూండ్లను గొనిరండు.
సఖీ, రోహిణీ, ఊరడిల్లుము. ఊరడిల్లుము.

రోహి—మ. అనుఁగున్నెచ్చెలులార! నిర్దయత నత్యంతంబు నాప్రాణనా
థుని రాజాత్మజుఁ డాఁచి, యేల నిటు వానిన్ దుల్సేయు? చూపుఁడు మీ

రనుమానింపక లేఁచో మదనబా ◆ణాగ్నిన్ మెయిస్వేఁడి వేఁ
జని జన్మాంతరమందునైన నతనిన్ ◆సత్యంబుగాఁ గూడెదన్.

వకు—సఖీ! ఏల నీవిట్లు మాపై నిరాపనింద మోపెదవు?

క. కలనాదకంఠి చూపం
గలనా కలలోనఁ గనిన ◆ కాంతుని భువిలోఁ
గల నారులెల్ల నీవలెఁ
గల నామోదించి వెతలఁ ◆ గలఁగుదురె చెలీ!

రోహి—ఛీ. ఛీ. దురాత్మురాలా, మీ మొగముఁ జూడరాదు. నా యొద్దనుండి తొలఁగిపొండు. (అని త్రోసి వేయుచున్నది.)

మాధ—సఖీ! లేనిపోని భ్రాంతులాందగులక సంతసంబునఁ దోడివారలవలె మెలంగరాదటే.

చ. కలయుగ నెండమావులను ◆ గనఁగ దోఁచెడు నీరు సత్యమే?
యలరెడు నద్దపుందళుకు ◆ నందలి బింబము నిక్కవంబె? వ
న్నెలవగలాడి! నీదయిన ◆ నీడనుజూచి భ్రమించెదేలనే?
కలఁ గనినట్టి రాసుతుని ◆ కై తమిఁజెంది కృశించు టొప్పునే?

రోహి—హా! ప్రాణేశ్వరా!

మ. అవురా! మామకపూర్వజన్మకృత పు◆ణ్యాంబుల్దలంపంగ న
ట్టివియౌ! నాథ, మదీయబంధువులు పా◆టింపంగ దుస్స్వప్నసం
భవమూపుండవటంచుఁ బల్కెదరు దు◆ర్భ్రాంతి న్నిను న్నామనం
బవనిన్ గుమ్మరపారెపైసిడినయ◆ట్లారాటముం జెందెదన్.

వకు—సఖీ, ఊరడిల్లుము.

రోహి—వహ్వా, స్త్రీజన్మ మెత్తినఁదు కట్టినవమోహనాంగునిఁ జేపట్టి వాని మహనీయ మంజులమధురాలాపంబులఁ దనివితీరఁ గర్ణంబులంగ్రోలుచు నాతని పొందునదియే జన్మసాఫల్యమును జెందవలయును గదా. అహాహా!

ఉ. ఆ నగుమోము తామరస ♦ మా నును నిద్దపుఁ దళ్కుఁ జెక్కు లా
మేనిమెఱుంగు నా మిసిమి ♦ మీసము నా మృగరాజవత్సు మా
తేని కుఁజిమ్ము వా తెఱయుఁ ♦ దేఁటగు నా నికు వాలుకన్నులే
మానిని పొందఁగల్గి నరి ♦ మంబున సౌఖ్యపయోధిఁ దేలునో !

[అంత వైద్యుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

మాధ—సఖీ, వైద్యుఁడు వచ్చియున్నాఁడు చూడుము.

రోహి—(ఆమాటలు వినకయే తనలో) అన్నా! నే నామోహనాకారుని పరాధీనుని గానిచ్చెదనే? అయ్యో, ఈవిరహవేదన నెట్లు సహింపఁజాలను. అకటా!

శా. ఆజాబిల్లి వెలుంగు తేఁకు తన మా ♦ యన్ జేసి నాదిత్త మీ
వ్యాజంబొక్కటిఁ బన్నినో పరిణయ ♦ భ్రాంతిన్ దగుల్పంగఁగా
కేజాలిన్ నను బిట్టువేచ మనసై ♦ యీరీతి నన్బాసెనో
ఈజాము లక్కడ దేర్పఁగా నెటులొకో ♦ ఈ బాధ నెట్లోర్తునో.

అబ్బా! (అని నిటలతటఘటితకరకమలపుటయై బోటనవేలి నేలవ్రాయుచు నిట్టూర్పు విడుచుచున్నది.)

దమ—(రాచకూఁతుని సమీపించి) తల్లీ, శాంతింపుఁడు. ఎవనిని గుఱించి మీ రిట్లుఁ బ్రలాపించుచున్నారు?

రోహి—(కోపముతో) ఓరీ! మూర్ఖా! ఎవఁడవు రానీవు? మీరందఱు కలిసి నాఁటిరాత్రి నా హస్తగతంబునఁ గనిపించు మోహనాకారుని దెచ్చోట దాచిరో చెప్పుఁడు.

దమ—తల్లీ, తొందరపడిన లాభము లేదు. శాంతిల్లినచో మీకు నే నొక పరమరహస్యమును దెల్పెద.

రోహి—మంచిది. ఆ రహస్య మేమి?

దమ—తల్లీ మీస్థితినిజూడ నాకొక సందేహము పొడము చున్నది. ఆసందేహమును ముందుగ నివారించితిరేని నారహస్యమును దెల్పెద.

రోహి.—సరే, నీ సందేహమేమి?

దమ.—తల్లీ, ఆ రాజకుమారుఁడు స్వప్నపురుషుండు కాక నిజమైన మానవుఁడేయైనచో మీ సేవకులలోఁగాని బంధుగులలోఁగాని యొక్కఁడైనను వాని వరసి తీసికొని రాలేకపోయెనా?

రోహి.—అయ్యో! ఏమని చెప్పుదును! పురుషవతంసమా! నా సేవకులకు మిత్త్రులకు బంధుగులకు నాకు నిజముగ మతిపోయియున్నదనియే యభిప్రాయము. ఇపు డిట నున్నవారిలో నొకరైనను నాయందు నిజమైన యభిమానము కలవారు లేరు.

ఉత్సాహ. చిన్ననాఁటనుండి నాదు • చెల్మిచేఁ జెలంగు మా
యన్న చిత్త్రసేనుఁ డేఁగ • యాత్త్రసేయ నింక నా
కెన్నఁడైన వచ్చునే యఁకేమనందు సిద్ధు వాఁ
డున్న నాయవస్థఁ జూచి • యోర్చునే దయామతిన్.

దమ.—అన్నా, పాపము, ఎంతకష్టము. (అని చేతులడ్డుపెట్టుకొని కన్నీరు తుడుచుకొనుచున్నాఁడు.)

రోహి.—మానవోత్తమా! నీ వెవ్వండవు? ఏదేశమునుండి వచ్చితివి? ఇచ్చోటకు రాఁగతం బేమి? నీ చర్యలను జూడఁగా నాకొక సందియంబు పొడముచున్నది.

దమ.—తల్లీ, నేనొక పరదేశవాసుఁడను. వైద్యవేషముచేఁ గాలముఁ గడపుచున్నవాఁడ. మీకు కొండొక కారణంబుచే మనఃక్లేశంబు కలిగెనని విని దాని నివారింపఁ బూని వచ్చియుంటిని.

రోహి.—అన్నా, నీ వొక కాలచోదితుండవగు వైద్యవేషుండవేనా?

దమ.—తల్లీ, అవును. నే నుచితకాలచోదితుండనే. వైద్యుండనే కాని వైద్యవేషుండను కాను.

రోహి.—నీవు చెప్పఁదలఁచియున్న పరమరహస్య మెట్టిదియో దెల్పుము.

దమ.—మంచిది. (అని సమీపించి చెవులో నద్దియో జెప్పుచున్నాఁడు.)

రోహి—(ప్రసన్నముఖియై) ఓహో నే నింక ధన్యురాలనయ్యెద.
(అని యానందపారవశ్యంబుచే నిశ్చేష్టితురాలగుచున్నది.)

[అంత నెచ్చెలులు సంభ్రమంబుగఁ బరతెంచి]

వకు—ఓహో ! చెలి ! ఏమియావింత ! నీమిథ్యాపురుషుని జాడలే మైనఁ దెలియవచ్చినవా యేమి ?

మాధ—అవును. అటులనే తోఁచుచున్నది. సఖీ ! ఏల నీవిప్పుడింతగ వికసితవదనారవిందవై యొప్పుచుంటివి ?

రోహి—సఖులారా ! ఈ వైద్యతిలకుని ప్రభావంబుచే నామనో వ్యాధి శీఘ్రకాలములో నివారణయగుటకు సందియంబు లేదు.

దమ—(తనలో) ఓ పరమేశ్వరా! నాప్రయత్నము నెల్ల ఫలింపఁ జేసె దవో నీదే భారము.

రోహి—(సహర్షముగా వైద్యుని సమీపించి) ఓహో ! వైద్యక్రియా కౌశలా ! ఇంక నాప్రాణములు నిలుచుటకు నీబుద్ధి విశేషమే యాధారము. నామనోవ్యాధిని నివారింపసమర్థంబగు విషయం బున సంఘటింపవలయును జుమీ ? నీవు నాకర్ణపుటములయం దుఁ బ్రయోగించిన మంత్రప్రభావంబులచే నామనోవ్యాధి సగము నివారణమైనది. తక్కినసగము శీఘ్రకాలములోనే నివారణఁ జేసెదవని నమ్ముచున్నదాన.

వకు—భిషగ్వరా ! మాప్రియసఖిని నుల్లసింపఁ జేసినచో నీవు గొప్ప పారితోషకంబును బొందఁగలిగెదవు.

రోహి—నెచ్చెలులారా! నాకిప్పు డత్యంతానందముగ నున్నది సుఁడీ! (అంత చెలికత్తియలందఱు నేకముఖులై పేరెలుంగున) ఓహో! యేమినాభాగ్యము ! (అని కోలాహలముగ వంతసింపుచుండ దమహారాజుగారు ప్రవేశించుచున్నారు.)

దత్తు—ఓహో హో! ఏమి! నా భాగ్యరాశియగు చిలుకలకొలికి యీరోజున బహుప్రసన్నముఖయై యున్నయది. ఏమి నాపుణ్యము! (అని కొమార్తెను సమీపించి)

శా. రావే ముద్దులపట్టి రా గుణఖనీ ♦ రావే సుధాంశూజ్జ్వలా
రావే కోమలపద్మపత్త్రనయనా ♦ రావే లతాంతాధరా
రావే నోములపంట మూలధనమా ♦ రావే కలాకౌశలీ
రావే సంతసమందఁ జేయఁగదవే ♦ రా భాగ్యరాశీ సుతా.

ఆ. వె. నాదు ముద్దుమూట ♦ నా భాగ్యరత్నమా
నాదు జీవనంబు ♦ నానిధాన
నాదు ప్రాపు నీవ ♦ నమ్మియుంటిని చాల
నాదు వెతలఁ బాప ♦ నాతి రావె.

తల్లీ, నీమనోధనాపేక్షితుండగు రాజశేఖరుండు వచ్చియున్నాఁడు. నీవు సుముఖివై వానిని వరించి సుఖము వడయుము.

రోహి—దుఃఖము వడయుమనుఁడు, ఇంతయేల? తండ్రి మీ మాయోపాయము సంపూర్ణముగా ఫలించినది. మీరు నా యెడల నిజమైన పుత్త్రికాభిమానము కలదేని నాజీవితేశ్వరుని జూపుఁడు. లేనిచో నే రజ్జువిషాగ్ని జలంబులఁ బ్రాణపరిత్యాగంబుఁ జేయుట నిశ్చయము.

దత్తు—అన్నా! నా ప్రియపుత్రీరత్నంబున కింకను మతిపోయియే యున్నది. కలలోఁ గని భ్రమించిన రాకొమరుని నే నెట్లు దోడ్కొని రాఁగలిగెదను? తోడ్కొనిరానిచో నాముద్దులగున్న తనప్రాణంబులను విడుచునఁట. నే నేమి సేయుదును. అయ్యో, తల్లీ! నిరపరాధినైన నిన్ను వెతలపాలుచేయుటకు మేము శత్రులమే?

మత్తకోకిల. మున్ను నేబహునోములన్ వ్రతముల్ ఘనమ్ముగఁ జేసినా
నన్నుతాంగిరో నిన్నుఁ గని వంశంబునన్ దౌహిత్రులా
భోన్నతిన్ ఘటియింతువంచుఁ మహోన్నతస్థితిఁ బెంచితిన్
గన్నతల్లి యకాలమృత్యువు కైవసం బెటు జేతునే.

(అని సమీపంబునంగల వైద్యునిఁజూచి) ఆఁ! వేషధారీ! నీమోసము తెలిసినది. కాని యందులకు దగినఫలము నిప్పుడే యనుభవించెదవు.

దమ—దేవా, నాదుమనవి యొకటి చిత్తగింపుఁడు. దేవరవారి కుమారీరత్నంబున కొకపైత్యవ్యాధి యంకురించి యీమె నీప్రకారము బాధించుచున్నది. ఆద్దాని ముహూర్తమాత్రములోఁ గుదుర్ప సమర్థంబగు వనమూలిక యొకటి కలదు. అయ్యది ప్రస్తుతము నాయొద్ద లేకపోయినను ద్వీపాంతరములయం దెందైన నాయౌషధిని వెదకి తెచ్చి మీపట్టికీవ్యాధి నివారణఁ జేసెద.

దత్తు—మాయవైద్యుఁడా, ఇఁకను మేము నిన్ను నమ్మఁజాలము. కుదిర్చెదమని వచ్చి కుదర్పలేనివారు పొందెడు శిక్షను బొందుటకు సిద్ధముగ నుండుము.

రోహి—తండ్రీ! నాకీవైద్యశిలకునియందు దృఢమైన నమ్మకము కలదు, కావున వీనిపైనలుగక నీతండు చెప్పిన చొప్పుఁ జరిగించుటయె నాకోరిక.

దత్తు—అటులైన, తల్లీ, ముఖ్యముగ నీకోరికప్రకారమే జరిగించెదను. వైద్యుఁడా, నీ వెంతకాలములో నాయౌషధిని దీసికొని రాఁగలిగెదవు?

దమ—దేవా, ఒకమాసము గడువిచ్చినం జాలును.

దత్తు—మంచిది. ఇప్పుడే రేవులో యానపాత్రము సిద్ధముగ నున్నయది, శీఘ్రము పోయిరమ్ము. (అని యందఱు నిష్క్రమించుచున్నారు.)





శ్రీరస్తు.

# రోహిణీసుధాకరవిజయము

## చతుర్థాంకము.

ప్రథమరంగము:—సముద్రతీరము.

[దమనుఁడు ప్రవేశించును.]

దమ—ఓ భగవానుఁడా! మింట నెగయు పక్కియలకును నీట జనించు జలజంతువులకును భూమిపై విహరించు ప్రాణికోటికిని నీవ కదా సర్వశరణ్యుఁడవు. నీ కటాక్షంబుచే ఈయపారపారావారంబునుండి పెనుగాలిచేఁ జిక్కువడియు సురక్షితుండనై గట్టు చేరఁగలిగితిని. అబ్బా, ఏమి తూఁతుపాను—

లయగ్రాహి.

పింక్కటపు మారుతము ♦ లొక్కతతి రేగెనిరు
ప్రక్కల తరంగములు ♦ నెక్కొనియెమర్ర బ్రా
గ్దిక్కునను మించులుఁ ద♦ళుక్కుమన మేఘములు
మిక్కిలి గర్జిలెడు ♦ నక్కజము గాఁగన్
గ్రిక్కదలె నోడ యొక ♦ చక్కని జరింపకయు
నెక్కడను డోలగతి ♦ నిక్కముగ నూఁగఁన్
గ్రిక్కిరియఁగాఁ దిమిర ♦ ముక్కడరఁ గ్రమ్ముటను
వెక్కసము తోఁచె నది ♦ యెక్కడి తుపానో!

అన్నా ! నా సహచరు లేమయిపోయిరో కదా. గోరుచుట్టుపై రోకలిపోటువలె మేము ప్రయాణము చేయుచుండిన యోడ పెనుగాలికి చిక్కుకొనుటయేగాక దురదృష్టవశంబున యొకకొండకుఁ దగులుకొని పెళపెళారావంబుల చిన్నభిన్నములయ్యె. అప్పుడ సంకుల మేమని చెప్పుదును.

సీ. ఒకయోర నోడసా • విధులార్తరవములఁ, బటుసంభ్రమంబునఁ • బఱచుచుండి
రొకచెంతఁ బితరుల • నొత్తి చీకాకు బాల, కులరోదనధ్వాన • ములు చెలంగె
నొకవంక నెదురొమ్ము • లకుఁ గందువులదార్చి, యడలు బోఁటులరోదన్వ • లతికయిల్లె
నొకకొన నతిభీత • చకితవృద్ధజనాళి, హాహారవంబుల • నడలఁ జొచ్చె
గీ. ప్రబలఝంఝానిలంబు వీ • వంగఁ దొడఁగ, భీకరంబుగఁ దరఁగలు • పిక్కటిల్లెఁ
జిటపటధ్వానముల నోడ • చెక్కలెల్ల, వీడు నోదేవ వారిఁ గా • పాడుమయ్య.

కానిమ్ము దైవసంకల్ప మెట్లున్నదో అట్లు కాఁగలదు. ఇప్పు డేమిచేయుదును. ముందుకు పోవుటయన్న నగణితగ్లానిచే నా కరచరణాద్యవయవంబులు లేవియు స్వాధీనములు గాకయుండె. క్షుత్పిపాసాపీడితుండ నగుటచే నా యాయాస మంతకంత కెచ్చుచుండె. అబ్బా ! (అని చతికిలంబడి)

చ. నడవఁగఁ గాళ్ళు రావు నయ • నంబులఁ జీఁకటి గ్రమ్మె శ్రాంతిచే
పడఁకుచునుంటి శీతమున • వస్త్రములుం దడియార లేదు నేఁ
గడువడి క్షుత్పిపాసలను • గాసిలుచుంటిని గాన నింక నా
బడలిక వాయఁ గొంతవడిఁ • బచ్చికపట్టున విశ్రమించెదన్.

(అని యిటునటుఁ జూచి) అదిగో నిచటి కనతిదూరంబున నొకతటాకంబును దానిచెంగట నొకరసాలవృక్షంబును గాన్పించెడు. ఎంత శ్రమపడినయైన నే నచటికేగి చూతఫలంబులఁ గడుపార భక్షించి నిర్మలోదక పానంబుచే సేదఁదేరి కొంతవడి యట విశ్రమించెద. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

[అంత విశారదుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

విశా—ఓహో! ఏమి యీయింద్రజాలము! సుధాకరయువరాజ సంద్రి ముని మిథ్యామనోభ్రాంతికి మూల మెట్టిదియో విచారింపవల సినదని సింహళద్వీపభూపాలుం డగు రత్నాకరమహారాజుగారు నా కాజ్ఞాపించియున్నారు. నే నెంతదేశము తిరిగిన నందుకు సదృశంబైన విషయం బెద్దియుఁ గానరాదు. ఈమగధదేశం బునఁ గూడ నావదంతియే వ్యాపించియుండెను కాఁబోలు. ఓహో! ఏమి యీ ఎత్రిము! అదిగో మగధదేశాధిపతియగు రాజశేఖరుఁ డమాత్యద్వితీయుండై యిటులనే వచ్చుచున్నాఁడు. ఆతండు పాంచాలనరేంద్రునితోఁగూడి మాయేలికపై నేమేమి టిదియో మంతనములు చేయుచుండెనని తెలియవచ్చినది. కావున వీర లిప్పు డేమేమి ముచ్చటించుకొనియెదరో నే నీ చెట్టుచా టుననుండి విని యెద. (అని యొకచెట్టుచాటున డాగుచున్నాఁడు).

[అంత రాజశేఖరుండును, మానవర్మయుఁ బ్రవేశించుచున్నారు]

రాజ—మిత్రమా! ఆకమలాకరం బెంత రమణీయముగా నున్నదో చూడుము.

చ. తమచెలిరాకచే నలరి ♦ తమ్ములు సంతసమొందుచుండ లో
భ్రమరము లుత్సహించి తమ ♦ వల్లభవల్లభులం గ్రమంబునన్
దమకము మీఱఁ గూడఁగను ♦ దగ్గరి తేఁగ విహంగసంఘముల్
భ్రమఁగొని పాఱఁగంటె కను ♦ పండువఁగొల్పు సరోవరం బిటన్.

(అని యిటునటుఁ జూచి) మంత్రిపుంగవా! ఆకనఁబడెడు కుజచ్ఛాయ నెవరో మానవుండు కడుగాఢనిద్రాముద్రితుఁడై పరుండియున్నాఁడు. అతం డీమగధదేశంబునకు రాఁ గతం బెట్టిదియో తెలిసికొని రావల యును. (అని నిద్రాసక్తుండైయున్న దమనుని చేరంజని వాని జేబులోని యుత్తరంబును బసిఁడియుంగరంబును బైకిఁదీసి చూచి నివ్వెఱఁగంది)

మిత్రమా! చూచితివా, యీయంగుళీయమును. ఇది యెవరిదియై యుండవచ్చునో కనిపెట్టుము. (అని యుంగరమును మంత్రిచేతి కిచ్చుచున్నాఁడు.)

మాన—(ఉంగరమును జూచి) ఇది రత్నాకరుని పుత్రుండగు సుధాకరుని యుంగరమువలెఁ గాన్పించెడు. మున్నొకనాఁడు సింహళద్వీపమందలి పద్మాకరతటంబున నవగాహనం బాచరించుచుండ సుధాకరుని వ్రేలినుండి జారి సలిలంబులోఁ బడ నిద్దాని నే వెదకి తిరుగ నాతని కిచ్చియుంటి.

రాజ—మంచిది. (అని సామర్షంబుగఁ దిరుగా యుంగరము నందుకొని) మిత్రమా! నాకు నట్లనే తోఁచుచున్నది. అయిన నీయుత్తరమేమిటిదో చూడనిమ్ము. పిమ్మట యోజింపవచ్చును. (అని యుత్తరముఁజూచుకొనితనలో) అన్నా! ఎంతమోసమువచ్చెను. కానిమ్ము. ఇప్పుడైనను మిగిలిపోలేదు. (ప్రకాశముగా) మిత్రమా! ఇటురమ్ము. (అని చెవులో నెద్దియో చెప్పుచున్నాఁడు.)

మాన—చిత్తము. చిత్తము. ముఖ్యముగ నే నట్టులనే జరిగించెద.

రాజ—ఇది మనకెంతయు నవశ్యకర్తవ్యంబు సుమీ. నీ వేమఱియుండకుము. నే నిప్పుడే పాంచాలదేశమునకుఁ బోయివచ్చెద. (అని రాజశేఖరుఁడు పాంచాలదేశమును గూర్చి ప్రయాణించుచున్నాఁడు.)

[అంత దమనుఁడు నిద్రమేల్కొని లేచి]

దమ—అన్నా! నేనెంతగాఢనిద్రం దవిలియుంటిని! (అని జేబు తడవుకొని) ఆఁ, ఏమిది! నా జేబులో పసిండి యుంగరంబు నుత్తరంబుఁ గానరావు! ఏమైపోయెనో కదా! అయ్యో! నేశ్రమపడి పూనివచ్చిన కార్య మెంతయు విఫలమైపోయినది. ఇంక నెట్లో గదా. హా! దైవమా!

సీ. ఇంత నెవ్విధమునఁ • బంకజముఖి మనో, హారుని నే నెంతైన • నరయుచుండ
బాధుఁ డెచ్చెదనంచు • నమ్మించి వచ్చితి, తెరవమో మెటు నేను • తిరిగిమాతుఁ
గాంచిన నీపని • కాయరూపండారెు, నా యన నేయుక్తిఁ • జేయనేర్తు ?
యుక్తిఁ జేయకయున్న • నువిద పీడదె తన, ప్రాణంబులను దుఃఖ • భరముచేతఁ
తే.గీ. గటకటా ! యేల నాకల • కంతకంతి, వ్యర్థమగు నాశలను ముంచి•వనటఁ బెంచి
పాశ మెండఁగట్టుకొంటిని • ప్రాలుమాలి, ఏలరాజలె నిటుకు నే • జాలిఁదూలి.
కట్టా ! ఎంతపనిజరిగెను. (అని మానవర్మను జూచి) ఓహో ! మాన
వోత్తమా ! మీ రెవ్వరు ? ఏల మీ రిచ్చోట వేంచేసి యుంటిరి ?

మాన—పురుష శ్రేష్ఠమా, నేను మగధ దేశాధిపతి యగు రాజశేఖరుని మంత్రిని. వేఁట విహారార్థమై వచ్చి పసిఁడియుంగరమును ముక్కునఁ గఱచి పట్టి పాఱుచున్న పిట్ట నొకదాని నెగిచి వచ్చుచు నీయాక్రందనమును విని నే నిటవచ్చితి.

దమ—ఓహో ! పసిఁడియుంగరముతో నెగిరిపోవు పిట్ట యేదిక్కు-కరిగెనో మీ రెఱుంగుదురా ?

మాన—ఎఱుఁగుదు. ఇటు రమ్మా. (అని దమునునితో మానవర్మ నిష్క్రమించుచున్నాఁడు.)

[అంత విశారదుఁడు వెలికి వచ్చి]

విశా—(స్వగతము) వీర లెద్ది యో దుర్మంత్రము చేయుచున్నారు. ఇంత హఠాత్తుగా రాజశేఖరుండు పాంచాలదేశంబున కేగుట కేమి హేతువో తెలియరాదు. బాటసారి యుంగరమును రాజశేఖరుండే హరించియుండవచ్చును. అయినను మానవర్మపలుకులు సంశయమును గలిగింపుచున్నవి. బాటసారి మాటలను బట్టిచూడఁగా నాతం డొక రాజకన్యాసందేశంబున వనిఁబూని వచ్చెనని తోఁచుచున్నది. ఎట్లయిన నీ యుదంతమును మా రాజు గారికి శీఘ్రముగఁ దెలుపవలయును.

(అని విశారదుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

ద్వితీయరంగము:—కారాగృహము.

[సింహళద్వీపంబున కారాగృహములో సుధాకరునిమోహాపరితాపము]

సుధా—హా! భగవానుఁడా! ఆదిని నేనేల వెఱ్ఱివై రాగ్యమును బూనితి. నన్నతిప్రేమచేఁ జూచుచుండెడు నా జననీజనకుల మాట నేనేల విననైతిని. ఓజీవితేశ్వరీ!

ఉ. నాయనుకూలభాగ్యసద ♦ నా మదనాగ్నిని దోఁచి యిట్లు నన్
బాయఁగ నీకు నేను వగ ♦ వాఁడనె కోమలి లేతమావిగు
న్నా! యిఁక నైన నాదునయ ♦ నంబుల కుత్సవమబ్బునట్లుగా
వేయువిధంబులం బరిత ♦ పించుచునుంటిని రావె సుందరీ.

క. కలికీ ముద్దులచిలుకల
కొలికీ నాయెద దహించు ♦ కూరిమియగు పూ
ములికీ నాపై నీకీ
యలుకేలే వేగ రావె ♦ యలికులవేణీ.

హా ఏణాక్షీ! నీ వెంతమాయలాడివే!

ఉ. ఎంతటిజాణవే సమయు ♦ మెంచి సుషుప్తిని జెందియుండ నా
వంతయు శంక లేక వరి ♦ హాసముఁ జేయఁగ నాను పక్క కే
కాంతము వచ్చి నేర్పుగను ♦ కాంతరో నీకనకాంగుళీయకమున్
సంతసమందఁ బెట్టితివి ♦ సారసలోచన నాదు వ్రేలికిన్.

కవిరాజవిరాజితము.

ఇదివర కిమ్మహి ♦ నిందునిభాస్యల ♦ నేనను నేత్రిల ♦ నెందఱినో
ముదముగఁ జూచిన ♦ మోహముకల్గదు ♦ మోహిని నీవయి ♦ ముందుగ నా
హృదయము చిక్కిన ♦ హీనవిలాసిని ♦ యేదెస డాగితి ♦ వే యకటా
యదనిదె మారశ ♦ రాగ్నికి నింధన ♦ మైతిని కావవె ♦ యబ్జముఖీ.

[అంత రత్నాకర మహారాజు ప్రవేశించి]

రత్నా—అన్నా! నాప్రియతనూజుండు కలలోఁగన్న కన్యకామణిం

కూర్చి రేయుంబవలు నెట్లు మనోభ్రాంతులకు లోనై నవయు
చున్నాఁడు! వీని నెట్లు శాంతిపఁ జేయనగునో కదా.

సుధా—(తన వ్రేలినున్న యుంగరముఁ జూచి) హా, నాముద్దుటుంగర
మా! నీవుకూడ నావలెనే కాంతివిహీనవై గాసిల్లుచుంటివా
యేమి? అటులనే కావచ్చును.

ఉ. ఆనలినాక్షిఁ బాసి విర ♦ హార్తిని గుంది కృశించుచున్న యీ
హీనుని వ్రేలినున్న ఫల ♦ మేమియటంచునొ కాక రాజబిం
బాననఁ బాసి యుండుటనొ ♦ హా! పరికింపఁగఁ గాంతిఁ ద్రోచి నీ
మానితదివ్య తేజమును ♦ మాపితి వెంతయు నంగుళీయమా.

ఉంగరమా, నీవు కాంతిమాసియున్నను నాకుఁ బ్రియమైనదాన వే.
అయ్యయో, వెఱ్ఱిదానదమా! మోహనాంగియైన యాకలువకంటి నెడఁ
బాసి యుంగరము నాసించిన నేమిలాభమే?

ఉ. మించులమించు నజ్జముల ♦ మేలిమిశోభహసించుఁ జంద్రికన్
గొంచెముసేయుఁ జక్కవల ♦ ను న్వాలిబుచ్చును పాముగెల్చు రా
యంచలఁవిగేరు మది ♦ రాక్షి శరీరవికాసనేత్రహా
సాంచితమైన చక్కదయు ♦ నారును యానముఁ జూడ నెంతయున్.

అయ్యో, నావంటి మందభాగ్యున కట్టిసుందరి లభించునే.

రత్నా—కుమారా! ఏల నీవిట్లు వ్యర్థమైన భ్రాంతులందగిలి పరిదే
వనంబుఁ జేసెదవు?

మంగళమహాశ్రీవృత్తము.

పూని కలలోఁ గనిన ♦ పూర్ణశశిబింబముఖిఁ ♦ బొందుటకుఁ గోరి మఱిచారా
హీనదయసుశీల విర ♦ హానలములోన వస ♦ హాయుఁడవునై పడి కుమారా
మానితశరీర సుకు ♦ మార తను తేజమును ♦ మాపఁగఁ దపించు టిది మేరా
వానిధివటంచు మది ♦ నమ్మితిని నిన్నుఁ గరు ♦ ణాకుణవిశేష గుణధీరా.

తనయా, నీకు మనఃప్రీతిని గలుగఁజేయఁజాలు సుందరీమణు లెందఱో
యుండఁగా స్వప్నమునఁ దోఁచు నాయిందువదనకై గుంటెదకేల రా తండ్రీ!

సుధా—తండ్రీ! మీ మహోపాయము సంపూర్ణముగా ఫలించినది. నన్నేల మీ రిప్పుడౌదార్య మభినయించెదరు ?

రత్నా—కుమారా! ఒంటరివై నీ వీ కారాగృహమునం దుండుటచేత గాఁబోలు దుస్స్వప్నములచే నీమతి చలించినది. ఇంక నీ వీచెఱ వీడి యంతిపురంబునకు రమ్ము.

సుధా—తండ్రీ! ఇప్పుడైన నాయమ్మలమిన్నను నాకన్నుల కగుపఱచితిరేని నే నీ చెఱసాల వీడివచ్చెద. లేకున్న నింక మీకు నాకు ఋణము చెల్లెనని గట్టిగ నమ్మియుండుఁడు.

[అంత విశారదుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

విశా—(రాజును సమీపించి) దేవా! దేవర వారి యాజ్ఞానుసారంబుగ సమస్తదేశములం గ్రుమ్మరుచు మగధదేశంబున నే నొక విశేషంబుఁ గంటి, మనవిచేసెదఁ జిత్తగింపుఁడు.

రత్నా—ఓహో విశారదా! విశేషమును దెచ్చితివా! అదెట్టిదియో దెల్పుము. నేను సావధానుండనై యుంటి.

విశా—దేవా! మగధదేశపరిసరప్రాంతారణ్యంబునంగల యొక తటాకంబుచెంత నెవరో యార్ద్రవస్త్రపరిధానుం డగునొక బాటసారి మిక్కుటమైన బడలికచే విశ్రమించి యుండఁగా నచ్చోటికి మగధదేశాధిపతియగు రాజశేఖరుండును నాతని సచివాగ్రగణ్యుండగు మానవర్మయు వచ్చి యటఁ గొంతతడవు మంతనంబుఁ జేసి మానవర్మతో నెద్దియో రహస్యముగఁ జెప్పి రాజశేఖరుండు పాంచాలదేశంబున కరిగె.

రత్నా—విశారదా! ఆమానవుం డెవ్వరై యుండునో నీవు కనిపెట్టఁ గలిగితివా?

విశా—దేవా! లేదు, కాని యాతం డొక రాజకన్యాసందేశంబున నేదేశసంచారముఁ జేయుచుండెనని తోఁచెడు.

రత్నా—ఎందువలన?

విశా—దేవా! పిమ్మట నా బాటసారి మేల్కాంచి జేబులోనియుత్తరంబును యుంగరంబును గానక వగచుచు,

చ. సారిది లతాంగి నేఁ దిరిగి ♦ చూచుట యెట్లొకో! చూచినన్
కను ల్విరియంగఁ జేసి కార్యము ఫలించెన తెల్పు మటన్న నేమియు
త్తరమియ నేర్తు? నుత్తరముఁ ♦ దప్పక నీయకయున్న మేను దు
ర్భరమని పీనుఁగాని మరు ♦ బారి సహించున యింక నక్కటా.

అని విలపింపఁదొడంగెను.

సుధా—ఆఁ! విశారదా! ఆయుత్తరము నాజీవితేశ్వరియే నా పేర వ్రాసినది. ఆయుంగరము నామనోహారి ధరియించిన నాముద్దుటుంగరమే. నన్నారయుటకై యానవాలుగ నామానసోత్తముండు వానిం గొనివచ్చుచుండె. అన్నా! ఎంతపనిజరిగెను. నామనోహారి పాంచాలదేశముననే యుండెను కాఁబోలు. ఆపురుషవతంసుని మోసపుచ్చి వానిని దురాత్ముండగు రాజశేఖరుండేహరించియుండునో పు. ఓరోరి రాజాధమా! (అనిదుర్వారంబగు తీక్ష్ణబూతోరుణ నేత్రుండై భూమిఁదన్నుచు) ఆనరాధముని నేనిప్పుడే పోయి శిక్షించి వచ్చెద. (అని సుధాకరుఁడు పరుఁగిడఁ బోవుచున్నాఁడు.)

రత్నా—(పుత్రుని యుద్రేకమును వారింపఁ జేసి) పుత్రా! త్వరపడకుము. వ్యర్థసంభ్రమంబువలని లాభమేమి? విశారదా! పిమ్మట నామానసోత్తముం డెటకేగెనో దెల్పుము.

విశా—దేవా! మానవర్మాయుంగరము నొకపక్షి ముక్కునఁగఱచి పట్టుకొని పోవుచుండెనని చెప్పి యాపురుషునిఁ దనవెంట గొని పోయె.

సుధా—ఆఁ! రాజశేఖరుని దౌష్ట్యమంతయుఁ దెలిసినది. ఓరీ ద్రోహీ! నీతో దుర్మార్గకృత్యభాగధేయుండును మంత్రికులపాంసనుం డగు మానవర్మతో నేమిదారుణ కర్మంబును బోధించి పోయితివి రా తులువా! తండ్రీ! నన్నుఁ బోనిండు.

రత్నా—కుమారా! నీ విపు డెటకేగెదవు?

సుధా—పాంచాలదేశంబున కేగెదను.

రత్నా—అర్భకా! శత్రుజనస్థానంబున కేఁగఁ జను నే? దుర్మదాంధుండును, పాంచాలకుల కలంకుండు నగు దత్త రాజాధముండు తన దేశంబున నిన్నుఁ గనినచో నూరకుండు నే. ఇదియునుఁ గాక,

ఉ. ఎంతబలాఢ్యుఁడైనను మహీవరపుత్రుఁడు సాహసంబునన్
జింతయొనర్పలేక ఫణి చెంతకుఁ జేరిన యట్లు విద్విష
త్ప్రాంతముఁ జేరు జొతయు న పాయము గల్గఁ జేయుఁ గావ ని
శ్చింతను నీవు నిల్వు మిటఁ జేకురు నీహృదయేప్సితంబులున్.

విశారదా! మన సుధాకరుని నీవెంటఁ గొనిపోయి యుద్యానవనవిహారమును జేయించి తీసికొనిరమ్ము.

విశా—చిత్తము (అని సుధాకరునితో విశారదుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

రత్నా—సుధాకరుఁడు వనవిహారంబుచే చిత్తవిశ్రాంతి నొంది సముల్లాసచిత్తుం డయ్యెడు.

(అని రత్నాకరుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

విశా—(ఉద్యానవనములో విహరింపుచు) సఖా! సుధాకరా! ఈయారామ మెంతమనోహరముగా నున్నదో చూతువు. ఎటుఁ జూచినను సకలపరిమళమిళితమంజులకుసుమపుంజరంజితంబై యొప్పుచుండెడు బహువిధంబులగు పువ్వుటీరంబులును, అత్యున్నతతాలహింతాల రసాలసాలంబులును, మధుర ఫలరసాస్వాదనా

యుత్తనానావిధపికనికరకలకలస్వనంబులును, కుసుమగర్భాంతర నిష్యందమరందపానమత్తమధుకర ఝుంకారరవంబులును, విశాలీకృత కలాపంబులతో నున్నత సైకతస్థలంబుల విహరించెడు కేకినీకాంతల మనోహరకూజితంబులును, సురుచిరకల్హార కాసార కేళికాలోలమృణాళనాళకబళ గ్రాసాసక్త కమనీయ కలహంస నికురుంబంబులును, గలిగి యీవనంబు నందనవనంబు ననుకరింపుచు విలసిల్లుచున్నయది. ఇందు నీకిచ్చవచ్చినట్లువిహరింపుము.

సుధా—మిత్రమా! నాచిలుకలకొలికి యీచెట్లమాటున నెందైనఁ డాగియుండెనేమో చూచెద. (అని యంతటను బరికించి చూచి) అన్నా! నామనోరమ యెచ్చోటను గానరాదయ్యె. ఏమి చేపుమా?

సీ. కీరవాణియటంచుఁ • గీరపంక్తులు కిక్కుఁ, దరళాక్షి నెటసైన • దాచెనేమొ!
అంచయానయగుట • హంసలు తీఁడిరించి, యెవనిమానినిఁగొని • యేగెనేమొ!
అళినీలకుంతలి • యాట రోషమునఁ దు, మ్మెదలు కాంతను గొని • చెదరెనేమొ!
ఘనకచయగుటచేఁ గాంతు మయూరముల్, గొబ్బున గనకాంగిఁ • గొనియెనేమొ!
తే.గీ. కాక వాల్గంటి కలకంఠ • కంఠియగుట, మత్సరంబునఁ గోయిల • ల్మఱుఁగుపఱచె
నేమొ! నే నెంత వెదకిన • నిందువదన, కానరాదయ్యె నాదు దు • ర్గతి యదేమొ!

కానిమ్ము వీరందఱినిఁ దెలిసికొనియెద.

సీ. ఏలాలవంగర • సాలసాలములను, కలరవంబుల నొప్పు • చిలుకలార!
అంబుజాకరవీచి • కాళిడోలాకేళి, దంబుమీఱెడు మరా • ళంబులార!
అరవిరిపూఁదేనె • లాని ఝుంఝుమ్మని, చెలరేగు భ్రమదాళి • కులములార!
ఘనఘనాఘనములఁ • గాంచి క్రీడింతు ర, వంబులచే మయూ • రంబులార!
తే.గీ. ఏల మీ రింత నామీఁద • జాలిలేక, యెంచి నాప్రాణపదమైన • మించుబోఁడి
నెచటదాచిరొ చెప్ప ర • దేమి? నన్ను, బాధపెట్టిన మీకేమి • భాగ్యమకట.

అన్నా! ఇవన్నియు నాయెడలఁ గఠినత్వమూని మిన్నకుండె. ఆహా! ఈ గండు తుమ్మెదలు, రాజహంసలు నెంత చెలరేగి యాడుచున్నవి. ఈ మలయానిలుఁడు మన్మథుఁడు నేఁటికిర్భయముగ విజృంభించుచున్నారు.

వీర లెవ్వరికి నా సామర్థ్యము తెలియదు కాఁబోలు.

సీ. రాజీవనేత్రి ♦ నాసికఁ జూపెద, నడరి రేగిన రోమ ♦ రాజులార,
నానాళి ధమ్మిల్ల ♦ మేను చూపెద మీకు, హస్తమిచ్చిన రాజ ♦ హంసలార,
వారమాతిలక నూ ♦ గారుఁ జూపెద నీకు, చులసి అంకెలువైన ♦ మలయపవన,
నాసఖి శ్రీకంఠ ♦ భాసంబుఁ జూపెదఁ, గిన్క సేసిన మీన ♦ కేతనుండ,
తే.గీ. తమ్ములను జేరి కాసార♦తటములఁ జిక్కె, యూఁనే డాగి చచ్చియుం♦బుట్టి మీరు
మిన్న కుండుట లగ్గు మీ ♦ మీపటుత్వ, ములను జూపిన హానివా ♦ టిలెడుసుండి.

ఔరా! ఎన్నివిధములచేతఁ జూచిన నివి నన్ను వేధించుట మాన వయ్యె. నే నీవిరహవేదనల నెట్లు సహింతునో కదా.

సీ. దోషాకరుఁడు నన్ను ♦ ద్రోహబుద్ధిని పంచు, వెన్నెల ల్పదరించి ♦ వేపుమంచెఁ
దుంటవిల్కాఁడు ము♦క్కంటివిసటుల గ్రాగి, యుతుబాణముల నెదఁ♦జొనుపుచుండెఁ
గలయుంగఁగలకంఠ ♦ కలకలస్వనములు, ముంపులకలెఁగగ్గ♦ములను నొంప
గండుతుమ్మెద లెంతో ♦ కండకావరమున, ఝుంకారరవముల ♦ సలుపుచుండ
తే. గీ. మొండుగను రేగి మలయాని♦లుండు చలము, చేత నాప్రాణవాయువు♦లెదరఁగొట్టఁ
బోలఁతిఁగానక నే నిట్లు ♦ పొరలుచుంటి, మొండితనమున విరహాగ్ని ♦ కుండమందు.

విశా—మిత్రమా! బుద్ధిమంతుఁడవయ్యు మాయామోహితుండవై
యేల పరితపించెదవు? వినుము.

తే. గీ. గాఢవిరహజ్వరంబుచేఁ గలతఁ జెంది
వంతనొందుచు నీవిప్డు ♦ భ్రాంతిజనిత
వనితపై రాగసరసిలో ♦ మునిఁగియున్నఁ
దజ్జ్వరము హెచ్చుదే యప ♦ థ్యంబుచేత.

ఇది యునుఁగాక, నీ వాదిని పూని యున్న వైరాగ్యసంపదంతయు నిపు డనురాగసంపదగా మారెనా యేమి?

ఉ. నీదగు యోగమార్గరతి ♦ నీదగు తత్త్వవివేక యుక్తియున్
నీదగు సాధువాదమును ♦ నీదగు శాస్త్రవివేచనంబు శా
తోదరిఁ జూచినంతనె వి ♦ యోగముఁ జెందెన? నీవు రేబవల్
వేదురి నుంకుచుండుట వి ♦ వేకమె మోహముచే సుధాకరా.

సుధా—మిత్రమా! విశారదా! ఏమని చెప్పుదును? ఆమాయలాడి మోహనాస్త్ర ప్రభావ మెట్టిదో కాని నాచిత్త మిపు డంతయుఁ జిత్తజాధీనం బై యున్నయది.

విశా—సఖా! అట్లుగాక వేఱొండేల జరుగు? నీ వాదిని యేమంటివి!

గీ. సకియచూడ్కులె విషవహ్ని ♦ సదృశ మరయఁ
బాలఁతి విభ్రమములు భోగ ♦ భోగతుల్య
మట్టి జవరాలి నోర్తుఁ జే ♦ పట్టుచున్నఁ
బన్నగంబును దరిఁ జేర్చు ♦ పగిది గాదె.

అనికదా. ఇప్పుడో,

తే. గీ. కలికిచూపులె యమృతంపు ♦ కళలటంచుఁ
బడఁతివిభ్రమమే బింబ ♦ ఫలకమనుచు
నింతుచందురుఁ జేస్పుటే ♦ నెలఁతఁ జేర్చు
టాయెఁగాఁబోలు వైరాగ్య ♦ మాయచేత.

ఆని నే నిత్తి చెప్పలేదా?

క. ఆవైరాగ్యము లన్నియు
జీవనజదళాక్షి తార ♦ సిలునందాకే
భావింప నిలుచుఁ బిమ్మట
భావజశాస్త్రార్థచర్చఁ ♦ బాల్పడు నను చున్.

సుధా—మిత్రమా! నన్నిపు డేల యుటంకించెదవు? వినుము.

మ. వరమాణిక్యసమానమై వెలయు నా ♦ భావంబు శాతేక్షణో
త్కరమున్ జిమ్మి కురంగలోచన విశు ♦ దక్షీరముం జేసి రా
గరసం బించుక తోడుగా నిడి చనన్ ♦ గామవ్రజుం డుద్ధతిన్
శరముల్ ధాసమున న్మథించి కలచున్ ♦ సైరించు ట్లెక్కడా.

విశా—మిత్రమా! నీవొక మిథ్యాకాంతను జూచినట్లు భ్రమించి యే యట్టిదురంతమోహపరితాపంబు నొందుచుంటివి. ఇంక నిజమైన

మోహనాంగియే దృగ్గోచరంబైనచో నీ వెంత మోహపరవశుండ వయ్యెదవో కదా.

సుధా—సఖా! విశారదా, నేనిపుడు పాంచాలదేశమున కేగ నభిలషించుచున్నాఁడను. చిన్నప్పటినుండియు నాకు ప్రియమిత్రుండవగు నీవైన నాకు సహాయముఁ జేయరాదా.

విశా—మిత్రమా! శత్రుజనస్థానంబైన పాంచాలదేశంబున కెట్లరిగెదవు? తొందరపడకుము.

సుధా—సఖా!

క్రౌంచపదవృత్తము.

భామిని, మిత్రా! నీమముతోడన్ ◆ బరిణయ మగుటకుఁ ◆ బరిమితిమీఱన్
గామశరంబుల్ వేమరి నొంచున్ ◆ గనికరమున నల ◆ కలికిని గాంచం
గామహిమాఢ్యాధామము నిద్దే ◆ కదలఁగవలయును ◆ కడువడి లెమ్మా
మామకచిత్తం బేమరకుండన్ ◆ మదవతి గవయఁగ ◆ మతిమతిఁ గోరన్.

కావున నీవిషయములో నాకు తప్పక సహకారివి కావలయును. (అని విశారదుని బ్రతిమాలుకొనుచున్నాఁడు.)

విశా—అన్నా! నే నిప్పు డేమి చేయవలయును. మిత్రమా! మంచిది. శీఘ్రింబ పోయి వత్తము రమ్ము.

(అని సుధాకరవిశారదులు పాంచాలదేశమునుగూర్చి నిష్క్రమించుచున్నారు.)

ఇది చతుర్థాంకము.





శ్రీరస్తు.

# రోహిణీసుధాకరవిజయము.

## పంచమాంకము.

రంగము—పాంచాలపురపరిసరోద్యానవనము.

[రాజశేఖర మహారాజుగారు ప్రవేశించుచున్నారు.]

రాజ—(స్వగతము) ఏమి! పాంచాలదేశాధిపతి యగు దక్షమహీపాలుండు నాయెడల నెంతమోసముఁ దలంచుచున్నాఁడు. ఆఁ! వీని నిజస్వభావ మంతయు నిపుడు వెల్లడి యైనది. తియ్యని మాటలను జెప్పి పైకి నన్నల్లునిగఁ జేకొన నిచ్చఁ గలిగియున్నట్లభినయించుచు రహస్యంబున నిజపుత్రికయొక్క స్వప్రయత్నంబుల ననుకూలింపుచున్నాఁడు. లేనిచో మొదటిస్వయంవర ప్రయత్నము నామూలమున నిలుపుఁ జేసియు నిప్పు డీ కన్యా సందేశంబున కేల నిచ్చగించు? కానిమ్ము, వీని కపటోపాయంబునకుం దగిన ప్రత్యుపాయంబును బన్ని వానిని వంచింపఁ బ్రయత్నించెద. రాయబారిగాఁ బోవుచుండిన పురుషుని చెఱసాలను బంధింప నియోగించి వచ్చితిని కదా! మానవర్మ యీ సరికే కృతకృత్యుఁడై యుండవచ్చును. కావున వానిజాడ దక్షనరేంద్రునకుఁగాని కాంతుతో వేచియుండెడు రోహిణీకన్యకకుఁ గాని సుధాకరునకుఁ గాని యెన్నండును తెలియ నేరదు.

దక్షరాజున కీయుంగరమును గనఁబఱచి యిమ్మ్యాది సుధాకరుని దాటఁ దెలిపితినేని శత్రువు ధరించెడు పసిండియుంగరమును నిజకుమారీమణి గ్రహించినందు కెంతయుఁ గినిసి యేతత్ప్రయత్నము లన్నియు భంగపఱచుట నిశ్చయము. (అని యిటు నటుఁ జూచి) ఆఁ! పాంచాలరాజుపట్టణములోఁ బ్రవేశించితిని కదా. ఇంక నన్నియుఁ జక్కంబడెను.

[తెరలో]

సుధా—ఛీ! ఛీ! దురాత్మా! నిలు, నిలు. క్షత్రియకులపాంసనా! రాజద్రోహి!

రాజ—(తెరవంకఁ జూచి) ఓరీ! తులువా! ఎవఁడవురా నీవు. నాయెదుటకు రమ్ము. నీ క్రొవ్వడంగించెద.

[అంత సుధాకరుఁడు ప్రవేశించి.]

పంచచామరము.

సుధా—అరే! దురాత్మ! నిల్వు మచ్చ • టాజి నన్నుఁ ద్రుంచి నా
వరాల ముద్దుటుంగరంబు • వారిజాక్షి లేఖయున్
బిరానఁ గొందు రార నీదు • బింక మేమొ చూచెదన్
సరాసరిన్ బెనంగి పోకు • నల్పరోరి బాలిశా.

రాజ—(మహాకోపముతో) ఓరీ! మూర్ఖా! ఏమనిరా పేలుచుంటివి? రమ్ము నిన్నుఁ ద్రుంచి నేను నిష్కంటక ప్రయత్నుండనయ్యెద.

(అని వరలోని కత్తిని పైకిఁదీసి ఝళిపించుచున్నాఁడు)

సుధా—ఓరీ! నీచాధమ! ఇది స్త్రీలు విహరించె డుద్యానవనము చూడుము. కొందఱు వారిజాక్షు లిటులనే వచ్చుచున్నారు. మన మిట మారణకర్మంబునకు మొనసిన నబలలు బెగ్గడిలెదరు. కావున నీకు శౌర్యము కలదేని వేఱొక బహిఃప్రదేశంబు

నకుం బోయి యాహవ మొనరింతము రమ్ము.

రాజ—మంచిది, అటులనే కానిమ్ము. (అని యుద్ధము నిష్క్రమించు చున్నారు).

[అంత రోహిణియు, వకుళ మాధవులును ప్రవేశించుచున్నారు.]

రోహి—సఖులారా! నాఁటి వైద్యుని జాడ యిం కేమైనం దెలియలేదు కదా! అయ్యో!

ఉ. మానసము నిండె వైద్యుఁడును ♦ మామకజీవధనంబుఁ దెచ్చి నా
వేసటఁ దీర్పఁడాయె తను ♦ వెంటనె యేఁగుట మానెనో వృథా
యాసముగాఁగ నేగియును ♦ నానరపాలునిఁ గాంచకుండె నో
మోసముఁ జేసెనో యెటుల ♦ మోహము నిల్పుదు నేను దైవమా.

మాధ—ప్రియసఖీ, ఆవైద్యుఁడు నీదేహమును స్వస్థపఱచుట కొక వనమాలికను గొనివచ్చుట కేఁగెనే గాని నిన్ను మోసము చేయు తలంపుతోఁ గాను.

ఉ. కాంతరో లేనిపోనిది య ♦ కారణముం గలలోనఁ గన్న భూ
కాంతతనూజుఁ గూర్చి మది ♦ గాసిలె దేల నె ముద్దుగుమ్మ కా
సింతయు నమ్మఁగాఁ దగునె ♦ యెక్కడి రాకొమరుండు వాఁడు నీ
చెంతకుఁ జేరు టెక్కడ వి ♦ చిత్రము కాదఁటె మానినీమణీ.

రోహి—(నిట్టూర్పు విడుచుచున్నది.)

వకు—సఖీ! ఊరడిల్లుము.

క. లలనా పూవిల్తుఁడు కో
లల నాటఁగ నేయ మదిఁ గ ♦ లంగెడు నీ లీ
లల నారయఁ జిత్రము చే
ల లనారతి మిట్లు వెలి మ ♦ లంగుదురు చెలీ.

రోహి—అయ్యో, ఏమి వీరి మూర్ఖత్వము!

మ. అలుక న్నిర్దయులై మదీయసఖులుం గా • హానాథ! నిన్ గూర్చి నే
విలపింప న్మతిపోయె నం చనెద రీ • విభ్రాంతి కేమందు నా
కలలోఁ గన్నులఁ గట్టిన ట్లగపడున్ • గంజాక్షు నీరూప మే
వలనన్ సైపఁగ నేర్తు నీవిరహమున్ • బాలింపఁగా రాఁగదే.

హా! భగవానుఁడా! కామదేవా! దీనురాలనగు నా మొఱాలకించి నాప్రాణనాథుని శీఘ్రంబుగ నిటకు రప్పించి వీరల దుర్భాగ్యతలం బోనాడి నాజీవంబుల నిలుపుము నీకు నమస్కరించెద.

సీ. గిరిసుతా నాథునో • హరుని జే చూపుమీ, పసుపుకుంకుమ నీకు • బత్తి నిత్తు
పద్మాలయా నాదు • ప్రాణేశుఁ జూపుమీ, విరిపువ్వుచయము న • ర్పింతు నీకు
భారతీ నాచిత్త • చోరునిఁ జూపుమీ, తులసీదళంబులఁ గొలుతు • నిన్ను
నగభేదిరాణి నా • నాథునిఁ జూపుమీ, లలి ముత్తెముల నిన్న • లంకరింతు
తే. గీ. వేల్పుటిల్లాండ్రలార నా • వెతల మాన్ప, నెంచి నాజీవితేశ్వరు • నిటకుఁ దెచ్చి
నాకుఁ గనులారఁ జూపిసం • ధానగరిమ, తాపమాన్పుఁడి ననుఁ గన్న • తల్లులార!

మాధ—నీ కీ యదృశ్యరూపుం డగునాథుం డెచ్చోట లభించెనే నాత్మయౌవనప్రాదుర్భావమహిమంబుచే నాయనంగునే నిజమోహనాంగునిగ భావించితివా యేమి? అయినను, సఖీ, నీమనోహరుని రూపరేఖావిలాసంబు లెట్టివియో తెలుప నొకచిత్రపటంబు వ్రాయుము.

రోహి—ప్రియసఖీ, ఏమిలాభము?

మాధ—లాభము లేకేమి? ఆపటమును దిగ్దేశంబుల కనిపినచో నట్టి పురుషుం డెందైన నుండెనేని కనిపెట్టుట సుకరంబు గదా.

రోహి—అయ్యో నెచ్చెలీ! విరహవేదనా దందహ్యమానమానసురాలనగు నే నామోహనాంగుని పటము నెట్లు లిఖింపఁ గలిగెదను!

వసు—సఖీ, మాధవీ! వనవిహారంబుచేఁ గాని మననెచ్చెలి సముల్లసితచిత్తురాలు కానేరదు. కావున మాధవీ, నెఱజాణవగు నీనే

యుంచుకుం దగినదానవు. ఎట్లైన నీయుచ్చకంటి నెమ్మనంబును నీయుచ్చకంబులచేఁ గళింగించి యుద్యానవనంబునకుఁ దోడ్కొనిపొమ్ము. (అని వకుళ నిష్క్రమించును.)

మాధ—మంచిది. (అని రోహిణిని సమీపించి) చెలీ, ప్రమదావనంబున కేగి విహరించివత్తము రమ్ము.

రోహి—సఖీ! నాకు వనవిహారమేలనే?

చ. ననుఁ గనుఁబ్రేమిబోయిన యు ♦ నంగుని బోలెడునా మనోహరుఁ
గనుఁగొనఁ జాలకుంటిని ♦ కాంతరో వైభవమేల నాకు జీ
వన మిఁక నేల పుష్పచయ ♦ వాటికలన్ మెలఁగంగఁ జాలఁ గా
వునఁ గరుణింపు డీరుజని ♦ పువ్వులఁ గోయుచు కాంతలీకఁగన్.

మాధ—పోనిమ్ము. ఆవనంబునం దైన నీమనోహరుండు దాఁగియుండెనేమో చూడవచ్చును కాదఁటే. సందేహించెదవేమి?

రోహి—మంచిది పోవుదము రమ్ము.

మాధ—సఖీ, అదిక్కున నెవరో యిరువురు మహాయోధులు పరస్పర జయకాంక్షల దారుణంబుగ నాహవం బొనరించుచున్నవారు. మన మాదిక్కున నేఁగఁజనదు. ఇటు రమ్ము. ఇటు ఇటు.
(అని రోహిణీ మాధవులు నిష్క్రమించుచున్నారు.)

సుధా—మహాత్మా! రాజశేఖరా! నీవు నీప్రాణంబుల కాశించితివేని యామానవోత్తము నేమి జేసితివో తెల్పుము.

రాజ—జయోన్నతుండవగు సుధాకరా! ఆపురుషుండు సజీవితుండయియే యున్నవాఁడు.

సుధా—ఎక్కడ?

రాజ—కారాగృహంబున.

సుధా—వానిని వెంటనే చెఱవిముక్తుని జేయవలయును. నీ వందులకై నీమంత్రిపేర నొకయాజ్ఞాపత్రికను వ్రాయుము. ఆపుర

షుండు చెఱవీడివచ్చువఱకు నీవిచ్చోటనే యుండవలయును.

రాజ—మంచిది. (అని యాజ్ఞాపత్రికను వ్రాసి సుధాకరునిచేతి కిచ్చుచున్నాఁడు.)

సుధా—విశారదా! నీ వీపత్రికనుఁ గొనిపోయి మానవర్మకుం జూపి యామానవోత్తముని చెఱవిముక్తునిఁ జేసి తోడ్కొనిరమ్ము.

విశా—మంచిది. (అని పత్రిక నందుకొని విశారదుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

రాజ—రాజోత్తమా! నీకు నే వధ్యుఁడనైతి. నే నింతటిశూరుండనియు మహాశూరుండ వగు నీతో మైత్రిఁ జేయ నభిలషించుచున్నాడను, కావున నా యెడల దయార్ద్రహృదయుండవై న న్నింక విడిచిపెట్టుము. నిన్ను నేనన్నటికి మఱువక ప్రవర్తించుచుండెద.

సుధా—నిన్ను విడిచిపెట్టుటకు వీలులేదు. నా మిత్త్రులు సురక్షితముగ వచ్చునంతవఱకు నీ విచ్చటనే యుండవలయును. అంతదనుక నిన్నేమరక చూచుచు పిదప కర్తవ్యమూహించెదను. (అని రాజ రాజశేఖరునితో సుధాకరుఁడు నిష్క్రమించును.)

[అంత నెచ్చెలియగు మాధవితో రోహిణి ప్రవేశించుచున్నది.]

మాధ—సఖీ, ఈవన మెంతరమణీయముగా నున్నదో చూడుము.

మదనదర్పణవృత్తము.

చారురుతములన్ బికాళి • సాజగానలోలతన్
మీఱఁ గొదమతేంట్లు • వారిజామృతంబు గ్రోలి ఝాం
కారములను జేయుచుండఁ • గాకలీస్వనంబులన్
జేసి పరభృతంబు లెట్లు • వాసిఁగూయుఁ గంటివే.

(అని పరిభ్రమించుచు) ప్రియసఖి!

రోహి—ఇచ్చోట నానాథుం డెంతైనఁ దాగియుండెనేమో చూచివచ్చెద. నెచ్చెలీ, నీవుకూడ రమ్ము.

మాధ—మంచిది. (అని యంతటను పరిభ్రమించును.)

రోహి—అన్నా, నే నెంత వెతకినను నామనోహరుండు దృగ్గోచరుండు కాఁడు. మీ రెవ్వరైనఁ జూచియుండి రేమో తెలిసికొనియెద.

ఉ. అంగజుఁబోలు నాథు నెట ♦ నైనను గంటిరె కీరశారికా
భృంగములార! చూతకురు ♦ విందతమాలకుజంబులార! మా
తంగములార! కోకిలిక ♦ దంబములార! మయూరలేలిహా
నాంగనలార! పర్వతజ ♦ లాశయతీరములార! మీ రిటన్.

మాధ—సఖీ! అల్లిబిల్లిగ నల్లుకొనిన యీమల్లెపువ్వుటీరంబులం గూడఁ దెలిసికొనుము.

రోహి—మంచిది.

ఉ. చల్లని లేతవెన్నెలదఁ ♦ జల్లెడు లేనగుమోమువాని ను
త్ఫుల్లసరోజముల్ దెగడు ♦ తోరపుఁగన్గవ మించువాని రం
జిల్లు విశాలవక్షుఁడగు ♦ చెన్నసలారెడు నీటుఁగాని నో
మల్లియలార! మీపొదల ♦ మాటున డాచిరె నామనోహరున్.

మాధ—సఖీ! వికసితారవిందసుందరంబగు నలపద్మాకరకూలంకష సైకతంబుల విహరించివత్తము రమ్ము. అచ్చోటి చల్లని పిల్లగాడ్పులవలన నీవిరహతాపంబు కొంత యుపశమించెడు.

రోహి—అయ్యో, నెచ్చెలీ! ఈవిటపిపటలంబులును నాయవస్థంజూచి కటకటంబడవయ్యె. పాపాత్ముండగు మారుండును నాపాలిటికి మారుండయ్యె. ఓయి దయావిహీనుండవగు విషమాస్త్రా!

ఉ. పాయక మున్ను శంకరుని ♦ ఫాలవిలోచనకీలలందు నీ
కాయము కాలలేదె విను ♦ గర్వము పిచ్చుకపైనఁ బూని చం
ద్రాయుధమేసినట్లబల ♦ నైన నను దుష్టవిచేష్టితుండవై
మాయలచేత నొంచెదవు ♦ మానవమే యిది నీకనంగుఁడా.

మాధ—చెలీ! అలతాంతాయుధుఁడు పోరఁబడెను కాఁబోలు. ఓ దర్పకా!

ఉ. ఓజలజాస్త్ర! వేచకుమ ♦ హారోద్ధతి మాచెలి నిష్ఠు పాంథరో
పాజనహంతకాఁడ! విల ♦ సన్మయుఘాఁబములే నొంచు వి
భ్రాజితమాళిహారమును ♦ రమ్యఫణీంద్రుఁ డటంచుఁ బాండిమం
బే జటిభూతియంచు భ్రమి ♦ యించి సఖిన్ మృడుఁడంచు నొంచితో.

రోహి—చెలీ, నామనోహరు నొకసారె బిగ్గరగాఁ బిలిచెద.

కల్యాణవృత్తము.

ఓరసస్ఫురా! మద ♦ యోధసంహారా!
యుదీర్ణ బాహువిక్రమ భా ♦ గ్యోదయాకరా,
మారసుందరా! సుకు ♦ మారశేఖరా!
మదీయచిత్తచోర! మహీ ♦ మండలీవరా,
కోఁయుంటిరా! యిటు ♦ కోపమేలరా!
గుణాకరా! సుధీవర! చే ♦ కోరభాసురా,
చేరవేమిరా! మది ♦ చింతఁబాపరా
శిరీషపుష్పకోమల యా ♦ శితు చాలురా.

[అంత వేఱొక చెంత సుధాకరుఁడు ప్రవేశించి]

సుధా—ఆచెట్టుచాటునఁ దళుక్కుమని మెఱయునది యేమిటిరో కదా! ఓహో!

తే. గీ. వివిధపాదపజాలసం ♦ వృతమునగుచు
భానుకరదుర్గమంబైన ♦ వనములోన
ఘనఘనాంతరవిద్యుత్ప్రి ♦ కాశలీల
మెఱయు తేజం బదే మొకో ♦ యొఱుఁగవలయు.

నామనోహరయే నిష్ఠ్యాలులతో నివ్వనంబునఁ బరిభ్రమించుచుండెను గాఁబోలు. నే నీచెట్టుచాటునడాఁగి తఱి వేచియుండెద.

(అని యొక చెట్టుపొంతను డాగుచున్నాఁడు.)

మాధ—నెచ్చెలీ! చూడుము.

కోకిలవృత్తము.

సారసాక్షిరొ పొన్నగున్నలు ♦ చంపకంబులు చూతఖ
ర్జూరముల్కదళీకుజంబులు ♦ చూడు మెట్టుల వాడె వి
స్ఫారితంబగు నీదు దోహద ♦ వైభవం బెసయంగ నా
కీరశారికహంసలెట్టుల ♦ ఖిన్నతన్ దురపిల్లునో
కోరి నీదు దయార్ద్రపోషణ ♦ కూర్మి నెచ్చెలి కంటివే.

సుధా—ఓహో వనితాశిరోమణి!

ఉ. నాహృదయాలవాలమున ♦ నాటిన రాగలతాంకురంబు నీ
దోహదలేశముం గనమి ♦ తొయ్యలి! దీనత వాడియుండె నా
హా! హరిణాక్షి! తావక క ♦ టాక్షరసంబును జిల్కి పెంచెదో
సాహసబుద్ధి దాని విర ♦ సంబుగఁ దుంచెదొ తెల్పు మిత్తఱిన్.

రోహి—ఓహో ప్రియసఖి! ఏమి! ఆశ్చర్యము! ఈవనంబునఁ బురుష
సింహుని మాటలు వినిపించినవి. వింటివే?

తే. గీ. చెలియరో వింటివే యావి♦చిత్రమే మొ
తనదు హృదయాలవాలంబు ♦ నను వెలుంగు
మోహలతఁ బెంపు మనుపల్కు ♦ పురుషవాక్య
సరణి వినవచ్చెఁ గర్ణర ♦ సాయనముగ.

నేఁటికి నాభాగ్యము పండుటచే నామనోహరుండే వచ్చియుండెను
గాఁబోలు.

మాధ—సఖి! నీవేల లేనిపోని భ్రాంతులందగిలి వగలపాలయ్యెదవు.
నీతండ్రిగారు నిన్నరయుచు నిటకు వచ్చెదరు.

భుజంగప్రయాతము. సరోజాక్షి నీస్వప్న ♦ సంభూతుఁడా యా
వరుం డెట్లు నిన్ గోరి ♦ వచ్చున్? నిజంబీ

విరాళి న్విడంబోఁచి ♦ వేశ్య న్మెలంగన్
స్మరార్ధత్యముఁ బాయు ♦ సౌఖ్యాప్తి కల్గున్.

సుధా—ఆఁ! ఈచేటి నాజీవితేశ్వరికి జెట్టునది కలుపుమాడెను. నే నింక నిట జాలము సేయరాదు. (అని రోహిణికి ప్రత్యక్షమై) జీవితేశ్వరీ !

ఉ. నాహృదయాలవాలమున ♦ నాటిన రాగలతాంకురంబు......

(అను పద్యమునే మఱలఁ జదువుచున్నాఁడు.)

రోహి—ఓ హాఁ హాఁ. (అని యానందపారవశ్యంబుచే నిశ్చేష్టితురాలగుచున్నది.)

సుధా—ఓ జీవితేశ్వరీ !

సీ. పకితు నీముఖచంద్రి ♦ చంద్రికాయములకై, కాంక్షఁ జెందు చకోర ♦ కంబుమాడ్కి
వెలఁది నీయధరోష్ఠ ♦ బింబామృతముఁ గ్రోలఁ దిలకించుచుండు రా ♦ చిలుకవోలె
చేడె నీధమ్మిల్ల ♦ జీమూతమును గన, నెమ్మిఁ గోరెడు పేద ♦ నెమలిపగిది
తన్వి నీకరబిస ♦ తంతువులను బట్టఁ, జూచెడు తొలుకరి ♦ నూఁదుపగిది

గీ. వనజలోచన నీదు చ ♦ ల్లనికటాక్షములను మదిఁ గోరి నీదు సుముఖమునకును
విమలశరబాణకేలల ♦ వేశిమికిని, తాళఁజాలకవచ్చితి ♦ హాళిఁ గూర్చ.

మాధ—పురుషవతంసమా ! మీరలెవ్వరు ? ఎచ్చోటనుండి వచ్చుచుంటిరి ? ఇటకు రాఁ గతంబేమి ?

గీ. తగవె మీవంటి వారికి ♦ తరుణులొంటి
పాటునను కేళికై పుష్ప ♦ వాటికలను
గ్రుమ్మరుచు నుండఁగని వచ్చి ♦ కుతుకమడర
సరస సల్లాపములఁ జేయ ♦ చతురశీల.

సుధా—(రోహిణితో) జీవితేశ్వరీ ! మఱచితివా యేమి ?

చ. పటుతరసుప్తితో మునిఁగి ♦ జాడిగమానుసఁ బాడ, రేయి చెం
గటికినివచ్చి మార్చితివి ♦ కాంచనరత్నమయాంగుళీయముల్

కుటిలవినీలవేణి యిది ♦ శ్లోకను నీకుపసిండియుంగరం
బిటువలెంబల్కఁ బాడియగునే దయతప్పన నీకు నాపయిన్.
(అని తన వ్రేలినున్న యుంగరమును చేతి కిచ్చుచున్నాఁడు.)

రోహి.—(ఉంగరము నందుకొనిచూచి సుమూళంబున) హా ! ప్రాణ నాయకా ! వచ్చితివా! (అని మూర్ఛిల్లుచున్నది.)

సుధా.—(ఉత్తరీయాంచలంబుచే సేదదేర్చుచున్నాఁడు.)

మాధ.—(ససంభ్రమంబుగఁ జనుదెంచి) ఆఁ ! ఏమిది! సఖీ! రోహిణీ!

రోహి.—(కొంతవడికి మూర్ఛ తెలిసి చూచి దిగ్గనలేచి) ఆహా ! నా మనోహరా ! పరమదాక్షిణ్యమూర్తివగు నీకు నేఁటికిఁగదా జ్ఞాపకమునకు వచ్చితిని. (అని తొలఁగిపోవుచున్నది.)

సుధా.—సుందరీ ! కినియకుము.

సీ. నల్లచీమలబారు ♦ నాఁటి నీనూగారు, ముద్దుగుల్కెడు నీదు ♦ మోముతీరు
జంటితేనియచవుల్ ♦ చుల్కఁజేయుఁగమోరు, సకియ నీవాతెఱ ♦ చవులతీరు
చిన్నివెన్నెలకందు ♦ చెల్మిసేయఁగఁగోరు, సుదతి నీనిద్దంపు ♦ నుదుటితీరు
టెక్కగములఁగేరుఁ ♦ జక్కనౌ గోరులు, మొలఁతనీకురులు తు♦మ్మెదలమాలు
తే. గొలఁత నీనును చెక్కిళ్లు ♦ నిద్దురేల, వద్దంపుకళ్కులను గేరు ♦ వనటికంబ
ములను గెలిచూలు నీయూరు ♦ లలరుఁబట్టి, గరిత నీపైపసౌరు జ♦గానఁగాన.

కావున నే,

సీ. కలికిరో నీకటాక్షములగ్ల కిన్నాళ్లఁ, గోదమశేటులరోదఁ ♦ గుందుచుంటి
జలజాక్షి నీదు దర్శనములే కిన్నాళ్లు, వెన్నెలకాఁకల ♦ వెతలఁబడితి
లలన నీముద్దు పల్కులు వినలుకిన్నాళ్లు, చిలుకలకల్లవేఁ ♦ జలకనైతి
రమణి నీయవలంబ ♦ నములేక యిన్నాళ్లు, చిగురాకుసెజ్జలఁ ♦ జేరియుంటి
గీ. వనితరో నీదు పదితూరు ♦ వన్నెపసిఁడి, చాయఁగలమేను గదియంగఁ ♦ గాలకిన్ని
నాళ్లు మరుబారికిని జిక్కి ♦ నవయుచుంటి, నేఁడు నను ధన్యుఁజేయవే ♦ నీరజాక్షి.

(అని కదియఁబోవుచున్నాఁడు.)

రోహి.—(తప్పించుకొని చిఱునవ్వొలయు వీక్షణంబుల వారింపుచున్నది.)

మాధ—(తనలో) ఓహో! ఈపురుషుఁడే యీమెచిత్తచోరుండు కాఁబోలు.

సుధా—(సోత్కంఠముతో) ఈకాంతాలలామ తనచెలికత్తియ దగ్గఱనుండెనని నన్ను డాయఁదలంకుచుండెను. కాని, యీలేమ-

మ. ఎలనెవ్వొప్పఁగ వాలుకన్గవలఁ దా ♦ నింపొంద వారింప డా
పలికే ల్జాపి మలంగి పైటసవరిం ♦ ప స్వేద్క వేళోత్క కే
లలరన్నోడ్చి సుమాస్త్రచందమునఁ బ్ర♦త్యాలీఢపాదంబులన్
జలజాతేక్షణచారుదృష్టివిశిఖా ♦ సారంబుఁ బైఁ జిమ్మెకున్.

మాధ—(తనలో) పరస్పరావలోకనానందపారవశ్యులయియున్న యీనాయికానాయకుల మధ్య పానకములోనిపుడుకవలె నేను నిలువరాను. వేఱొకయెడ కేగెద. (అని మాధవి నిష్క్రమించుచున్నది.)

సుధా—సుందరీ!

చ. వనరుహపాణి తావక య ♦ పాంగవిలోకనజాలసంహతుల్
మనసిజసాయకోత్కరస ♦ మానములై దురపిల్లఁజేయు నే
ననయము సర్వము న్మఱచి ♦ యార్తిఁగృశించితి నిన్ని నాళ్ళహా
నినుఁ గనినట్లఁ దోఁచె రమ♦ణీమణి నాకఖిలప్రపంచమున్.

నీవిప్పుడు నన్నుఁ దొలంగఁజేయుట న్యాయముకాదు. ఇదియునుఁగాక,

చ. మరుఁడను వేఁటకాఁ డసరి ♦ మామకహృత్ప్రిక శాబకంబుఁదా
గుఱివిరితూపులం దఱుమ ♦ గొబ్బున నీశరణంబుఁజొచ్చినన్
గరుణనుపేడి వెండియును ♦ కామునిబారికిఁ ద్రోయు నీకు సం
బరమఁట దాని నీహృదయ ♦ పంజరమందున డాచరాదొకో.

(అని చేయిఁ బట్టుకొనఁబోవుచున్నాఁడు.)

రోహి—(తప్పించుకొనితనలో) ఓందమా! త్వరపడకుము. త్వరపడకుము.

సుధా—కోమలీ!

ఉ. చూడవిదేమొ నీసడుద ♦ సోగ తెలింగనుదోయి విూల నూ
టాడవిదేమొ తేనియల ♦ నంతము జిప్పిలఁ జేయుపల్కులన్
వీడెదవేమొ యెంతనిను ♦ వేడిన నన్నిపు డాదరింప నీ
వాఁడను కానఁటే ముఖము ♦ వాల్చి తొలంగెదవేమి పాపమే.

చ. విరివిగ నంతట న్నెఱయు ♦ వెన్నెలవాకలఁదోఁగి భ్రాంతులన్
దరగలు పిక్కటిల్లుచు ను♦డగ్రిత రేగఁగ నూఁగులాడుచున్
దరుణిరో రాగరజ్జువులఁ ♦ దారసమైతిని యెట్టకేలకున్
శరణము కమ్మ నన్నిఁకను ♦ చయ్యనఁ గౌఁగిటఁ బ్రోదిసేయఁగన్.

(అని కదియఁబోవుచున్నాఁడు.)

రోహి—(మందస్మితసుందరవదనారవిందయై కోఁగంటిచూపులతో దొలంగిపోవుచున్నది.)

సుధా—హృదయేశ్వరీ!

ఆ. వె. మదనుఁ డదయుఁడగుచు ♦ మరిమరి శరములఁ

(అని తత్తరపడుచున్నాఁడు)

గుదియువడఁగ సలుపు ♦ కుతుకమడర

(అని సమీపించుచున్నాఁడు)

సదయువగుచు నన్ను ♦ సరి నేలరాదఁటే

(అని చేయికట్టుకొనుచున్నాఁడు)

జాల మేల బాల ♦ తాళఁజాల.

(అని కౌఁగిటఁ గదియించఁబోవుచున్నాఁడు).

[అంత తెరలో]

ఓసుధాకరా!

చ. దురితరతుండు మాగధుఁడు ♦ దుర్మదుఁడై నిను మోసపుచ్చి ము
ష్కరతసురింగి దతున్నృపుఁ ♦ గాంచి యవస్థను దెల్ప వార లి
ద్దరును ససైన్యులై వెడలి ♦ పోర నిను న్వధియింపనెంచి యు
ద్ధురతను వచ్చుచుండిరదె ♦ దష్టుల శిక్షయొనర్పఁగాఁ దగన్.

సుధా—(ఆలకించి) ఏమీ! ఓరి పాపాత్మా! నీవు పిరికిపందవై నా బారినుండి పారిపోయి ప్రాణములను రక్షించుకొంటివి గదా యని సంతోషించుచుండగా మరల నాపైఁ గయ్యమునకుఁ గాలు ద్రువ్వుచుంటివిరా? తుచ్ఛుఁడా! ఈసారి నిన్నుఁ ద్రుంచి నేమనిమ్మకొంటకుండ నయ్యెద. (అని రోహిణి మూర్ఛిల్లఁ సుధాకరుఁడు నిష్క్రమించును.)

[అంత రాజశేఖరుఁడును దత్తుఁడును ససైన్యంబుగఁ బ్రమదావనంబునఁ బ్రవేశింతురు.]

దత్తు—(మూర్ఛిల్లిపడియున్న రోహిణిం గాంచి) ఏమిది! నాకుమారీమణి భూమిపై నిట్లు పడియుండుటకుఁ గారణ మేమి? దురాత్ముఁడైన సుధాకరుఁడే యీద్రోహ మొనరించియుండునుకదా. మిత్రమా! రాజశేఖరా! నీవీవనమంతయు సైన్యసమేతుండవై వెదకి యాతుచ్ఛు నెందున్నను పట్టి బాధించి తోడ్కొనిరమ్ము.

రాజ—మంచిది. (అని ససైన్యంబుగ నిష్క్రమించును.)

దత్తు—ఈసమయమున దమనుఁడున్న నాకుమారీమణి సుఖస్థితిం గాంచును కదా (అని యిటునటుఁ జూచి హర్షముతో) అదిగో దమనుండు తలంచినంతనే వచ్చుచున్నాఁడు.

[అంత దమనుఁడు ప్రవేశించి దత్తునకు నమస్కరించును.]

దత్తు—దమనా! ముందుగ నాకుమారీమణిని మూర్ఛనుండి తెలివొందునటులఁ జేసి చేటీజనంబుచే నంతిపురంబున కనుపుము.

దమ—మహారాజా! ఈమె మూర్ఛిల్లుటకుఁ గారణ మేమో మీ రెఱింగితిరా?

దత్తు—సింహళద్వీపరాజాధముని పుత్రుండగు సుధాకరుం డీప్రమదావనంబున కేతెంచి యీ నాపుత్రికారత్నంబుతో మాట్లాడుచుండ నామిత్రుండగు రాజశేఖరుండు చూచెనట. ఆతుచ్ఛుఁడే

యీమె కట్టిడిద్రోహ మొనర్పించియుండునని నే దలంచుచున్నా
డను. కాని యీదుర్మార్గుని బట్టికొన ససైన్యుండై రాజశేఖ
రుండేగియున్నాఁడు.

దమ—(తనలో) సుధాకరుఁడు సురక్షితంబుగ నియ్యెడ కేగుదెంచినం
దకు నా కమితానందము కలుగుచున్నది. కాని యీపాపాత్ము
లచే వాని కేమియుపద్రవము తటస్థించునో యని భయము
కలుగుచున్నది. కానిమ్ము పరమేశ్వరుని సంకల్పం బెట్లున్నదో
యట్లే జరుగఁగలదు. (ప్రకాశముగా) మహారాజా! ముందుగ
నేఁబోయి మాధవిని వెదకి తోడ్కొనివచ్చెదను.

(అని దమనుఁడు నిష్క్రమించును.)

[అంత రాజశేఖరుఁడు ప్రవేశించి]

రాజ—మిత్రమా! చమూసమేతుండనై యీప్రమదావనమంతయు
వెదకితిని. కాని యాదుర్మార్గునిజాడ యెచ్చోటను గానరాదు.
అయినను సైన్యము నెల్లమొదల కంపితిని.

తే. గీ. చొచ్చి వాటిల్లు కుందేలు ♦ సుఖఁగఁగలదె
విమతదుర్వారనృపభుజం ♦ గముల కెల్ల
ఘనపరంతప రాజశే ♦ ఖరుని దైన
పేరు తలపోయ నీశ్వర ♦ వేరు గాదె.

(అంత రోహిణి మూర్ఛదెలిసి లేచును)

దత్తు—ఓడ్డా! అంతఃపురంబున కేగుదము రమ్ము. మిత్రమా! రాజశే
ఖరా! నీవు నీపనిమీఁద నే యుండుము.

(అని దత్తుఁడు రోహిణితో నిష్క్రమించును.)

రాజ—(ఆకసము వంకఁ జూచి) అదిగో భానుం డస్తగిరిఁ జేరె. నే నిట
నిలుచు టనవసరము. (అని రాజశేఖరుఁడు నిష్క్రమించును.)

ఇ ది పం చ మాం క ము.



శ్రీరస్తు.

# రోహిణీసుధాకరవిజయము



## షష్ఠాంకము.



ప్రథమరంగము—ఘోరారణ్యము.

[సుధాకర విశారదులు ప్రవేశింతురు]

సుధా—మిత్రమా, విశారదా, వైద్యవేషుండగు నామాననోత్తముం డీసరికే రాజనగరంబుఁ బ్రవేశించియుండునని తలంచెద. మనము వెంటనే పోయి వానిని కలిసికొనవలయును.

విశా—సఖా, ఇపుడే మన మిటనుండి బయలువెడలుట బహుదుర్ఘటము. చూడుము,

ఉ. దిక్కుల తెల్వి మాసె మృగ ♦ తీవ్రనినాదములుం జెలంగెఁ జుఁ
జక్కఁగ నంతటన్ గటిక ♦ చీఁకటి క్రమ్మెను భీకరాటవిన్
గ్రక్కునఁ బోవఁగా మనకుఁ ♦ గన్నులు కానఁగరావు గాన నీ
చక్కని నిద్రఁజెందుదము ♦ సమ్మతి వేకువఁ బోద మెమ్మెయిన్.

సుధా—మిత్రమా! మనముభయులము నొక్కసారె నిద్రింగూలిన క్రూరమృగంబులచే హానిసంభవించెను. కావున నీవు ముందు పరుండుము. నేను మేల్కొనియుండెద.

విశా—సఖా! నీవు శ్రాంతుండవై యుంటివి, ఇంచుకవడి నీవు నిద్రింపుము. నేను మేల్కొనియుండెద.

సుధా—మిత్రమా! అట్లుగాదు వినుము.

క. మును నీవు మేల్కొనంగా
నెనయఁగ నొంటరివి కావు ♦ నేమేల్కొన్నన్
మనసిజుఁడు పంచశరములఁ
గొనియుండెడు నాకు సుప్తి ♦ గొను మీవు మునున్.

విశా—అట్లయిన రాజకుమారా! నీవు బహుజాగ్రత్తఁగలిగి యప్రమత్తుఁడవై మేల్కొనియుండుము. నే నావటవృక్షముక్రింద నించుకవడి నిద్రించెద. (అని నిద్రించుచున్నాఁడు.)

సుధా—ఓహోహో, తూర్పున చంద్రోదయము మగుచున్నది.

సీ. హరిదబ్జవదనల ♦ వంకపథంబను, రంగంబునను తమి ♦ రమను తెరను
మెల్లమెల్లఁగ దింప ♦ నుల్లాసముగ నందు, రాత్రి శైలూషిక ♦ రాగఫాల
భాగంబుఁ బదపడి ♦ వదనంబు చూపట్టు, కరణి రేఖగ వాడిఁ ♦ గానుపించి
పిదప బింబము భాతి ♦ నొదవి ప్రాక్సతిగర్భ, శుక్తిముక్తాఫల ♦ స్ఫూర్తియనఁగఁ
తే.గీ. గలువ నెచ్చెలులకు నోము ♦ కల్మియనఁగఁ, దమ్మివిరిబోణులకు చక్రి ♦ దంపతులకు
గుండెజల్లన నదరూత్రి ♦ కుహారమునను, విరహులను వేపచందురుండు ♦ వెడలెఁజదల.

అన్నా, నే నీమోహాంధకారంబు నెట్లు సైతును. విరహజనపీడన దోషాకరుం డగుటనేకదా వీనికి దోషాకరుం డను నామంబు సార్థకమయ్యె. మఱియు,

తే. గీ. కలశవారాశిఁ దనతోడఁ ♦ గలిగినట్టి
ఔడబాగ్నిని గొనివచ్చి ♦ పాంథహృదయ
మర్మములనెల్ల దహియింప ♦ మత్సరమున
నేచి వెదఁజల్లుచుండె రే ♦ యెండమిషను

(అంత విశారదుఁడు మేల్కొని లేచి వచ్చి)

విశా—అన్నా! మిత్రమా! నీ వతివిశ్రాంతుండవయ్యు నించుకైన నిద్రఁజెందకుండితివి కదా.

ఉ. ఈయెడ వేగుఁజుక్క యుదయించె ♦ గుటీరము లెక్క కొక్కరో
కోయని కోడిపుంజులును ♦ గూయఁగసాగ మరుత్కిశోరముల్

హాయిగ వీచుచుండెను వి ♦ హంగకలస్వనముల్ చెలంగ నే
మోయిసఖుండ! చూడుమరు♦ణోదయమయ్యెడుఁ దూర్పుదిక్కునన్.

ఎంతపనిచేసితివి. చూడుము.

ఉ. కైరవము ల్ముడింగెఁ దమ ♦ కంబునఁ దమ్ములు సంతసించెడున్
దార లదృశ్యమయ్యె దివిఁ ♦ దద్దయుఁ జీఁకటు లూడెఁ బ్రాక్సతీ
సారసనేత్రి నెన్నుదుటి ♦ చక్కని కుంకుమబొట్టునాఁగ సొం
పూరెడు గెంపుచాయ లరు ♦ ణోదయకాలమునందుఁ బ్రాగ్దిశన్.

సుధా—మిత్రమా! మన ప్రయాణంబున కిదియ తఱియని తలంచెద చూడుము.

ఉ. భూసతి రేయియంతయును ♦ బొల్పుగ నాథుని గాంచ కార్తయై
వేసటఁ జెందు లేమవలె ♦ విన్నతనంబున మంచుకొంగుచే
గాసిలు మోముఁ గప్పికొని ♦ కంజహితున్ గనలేక నేడ్చి దా
భాసిలు నీప్రభాతమున ♦ భానుసమాగమనోత్సుకాత్మయై.

[అంత దమనుఁడు ప్రవేశించి]

దమ—యువరాజచంద్రమా, సుధాకరా, మనము పాంచాలదేశము సమీపించితిమి. పరాజయపరాభవానలంబుచే మ్రగ్గుచుండిన మాగధుండును దక్షిణమహీపాలుండును నిన్ను బంధింపంగోరి వివిధప్రయత్నములను జేయుచుండ నాప్రోత్సాహంబున రోహిణీకన్య కోరినకోరికపై యామెకు స్వయంవరోత్సవము జరిగింప నిశ్చయింపఁబడినది. కావున శీఘ్రంబుగఁ బోవుదము రండు. అదిగో సూర్యోదయం బగుచున్నది. చూడుము.

చ. కలువలవాయ కుక్కుభని ♦ కాయము తొట్టిలఁ డాయ చీఁకటుల్
బలువిడివాయ షట్పద మెడఁ ♦ బాయుచుఁ గూతలుగూయ దీపికా
కళికలకాంతిమాయ నల ♦ కంజముల వికసింపఁజేయ బాం
ధులు తమ బాటరోయ నదె ♦ తోఁచెడ ప్రాగ్నగశృంగమందనన్.

సుధా—సఖా, దమనా, ప్రిత్యర్థులమగు మే మెట్లు బాహాటంబుగ పురిఁ జేరనగు. మనమందఱమును మారు వేషములం ధరించి పుర ప్రవేశంబు చేయుట మేలని తలంచెద.

దమ—మంచిది. అటులనే చేయనగు కాని మిమ్ముల గౌరవింపఁదగు ప్రియత్నముల జరిగింప ముందుగ నేఁ బోయెదను. (అని దమ నుఁడు నిష్క్రమించును.)

సుధా—మిత్రమా! విశారదా, మన మాకనఁబడు జలాశయంబున గ్రుంకి మారు వేషంబులను ధరింతుము రమ్ము.

ద్వితీయరంగము—రాజాస్థానము.

[అంత దక్షమహారాజు, మారుతి, అన్యదేశాగతులగు మానవేంద్రులు స్వయంవరాస్థానంబునం బ్రవేశించుచున్నారు.]

దక్షు—భూజానులారా! నేఁడు నాభాగ్యోదయప్రభావంబున మీ వంటిరాజ బృందంబు నొక్కచోఁ జూడఁగంటి. కృతార్థుండనైతి.

మానవేం—రాజా! జగన్మోహనాంగియైన మీకుమారీమణి మోహాల తాబద్ధులమగు మేమందఱ మొక్కచోఁ గూడియుండుటబ్బురమే?

దక్షు—ధర్మార్థతులారా! నాపట్టి యిప్పుడే వచ్చి మీలో నొక్క భూవరకుమారుని వరించును. అప్పు డీశిరులైన ధరణీవరు లుఱుంగక వాత్సల్య భావంబుచే వధూవరుల నాశీర్వదింపఁ బ్రార్థించెద.

రాజ—రాజా! మీతనూజారత్నము కులశీలవయోరూపంబుల నెఱింగి వరించినచో మేమటులనే జరిగించెదము.

దక్షు—(మారుతితో) మంత్రిశేఖరా! నాకుమారీమణియింకను రాకఁ దడసె. కారణ మేమోకదా.

మారు—దేవా! ఆకోమలాంగిని దోడ్కొని వచ్చుటకు పుణ్యాంగనాజనంబుల నంపియుంటి. అదిగో దమనుఁడు నిటుల వచ్చుచున్నాఁడు.

(అంత దమనుఁడు ప్రవేశించుచున్నాఁడు)

దత్తు—(దవ్వులదమనునిఁగని) దమనా! నాకుమారీమణి పూర్ణాలంకృతురాలై వచ్చుచుండెనా?

దమ—చిత్తము దేవా నెచ్చెలులుదాను నిప్పుడే బయలుదేరి వచ్చుచున్నారు.

మారు— దేవా! అదిగో చూడుఁడు:—

తే. గీ. రిక్క-చెలికత్తియలతోఁడ ♦ రేవెలుంగుఁ
గదియఁబోయెడు రోహిణీ ♦ కాంత యనఁగ
మఱియు నరపాలలోకస ♦ న్మోహనాస్త్ర
మనఁగ రోహిణి సఖులతో ♦ నదిగో వచ్చె.

(అంత రోహిణి ప్రవేశించుచున్నది.)

దత్తు—(రోహిణిని ప్రియకుమారన్ దగ్గరఁ జేర్చి) ప్రియాత్మజా! స్వయంవర సమయమైనది. ఈవచ్చిన రాజలోకంబునెల్ల నీవు బాగుగ వీక్షించి నీకిష్టము గలిగినవాని వరించి వానిమెడలో నీ పుష్పహారమును గీలింపుము. (అనియొక పువ్వులదండ చేతికిచ్చుచున్నాఁడు.)

రోహి—(పుష్పహారమును గైకొని రాజసభ నవలోకించుచున్నది.)

దత్తు—మారుతీ! నీవుకూడఁబోయి ప్రత్యేకంబుగ నారాజవరులనీరామామణికిఁ జూపిరమ్ము.

మారు—చిత్తము. చిత్తము (అని యాకోమలాంగిని వెంబడించి) ఏణాక్షీ! చూడుము.

ఉ. వాఁడిలు నృపాలమౌళిమణి ♦ రంజితపాదపయోజయుగ్ముఁడై
లీలగ చందనాగరువి ♦ లేపనల న్బెలుపొంది జాళువా
మేలిపటంబుఁ గట్టి నెజే ♦ మించుతనుద్యుతి నొప్పు పాండ్యభూ
పాలవరేణ్యుఁ డితఁ డని ♦ వార్యపరాక్రముఁ డాజిఁ గోమలీ.

రోహి—(తనలో) ఈతం డతిశోభియు గర్వసంపన్నుండు నగుటచే వీనిం జూడరాదు.

(అని తొలఁగిపోవుచున్నది)

మారు—రాజాననా! వీనినిఁ జూడుము.

ఉ. రాజితరూపమందు నల ♦ రా జభిమానధనంబునందు రా
రాజు శరీరకాంతి నుడు ♦ రాజుఁ బరాక్రమమందు నంబికా
రాజును దానమందు యువ ♦ రాజును వైభవమందు దేవతా
రా జననొప్పు నీమగధ ♦ రాజును జూడవె రాజశేఖరుఁ.

రోహి—(తనలో) రణభీరువును దుర్మదాంధుండును నగు నీతండు కదనంబునఁ బరాజయంబు నొంది వచ్చిన జీవచ్ఛవము. కావున వీని మొగముఁ జూడరాదు. (అని కోపముతో తొలంగిపోవుచున్నది.)

మారు—కోమలీ!

మత్తకోకిల—పాళిమై గనుఁగొంటె శాత్రవ ♦ పంకజాకరదంతి భూ
పాలకేసరిఁడు రూపనిర్జిత ♦ భావజుండును వైభవో
ద్వేలుఁ డాంధ్రమహీధవుండును ♦ దివ్యశీలియునైన నే
పాళభూపతిఁ జూడు నీరల ♦ పద్మపత్రవిలోచనా.

రోహి—(తనలో) అతిమద్యవ్యసనాసక్తులును రణభీరువులు నగు వీరిని వరింప నామనం బిచ్చగింపదు. (అని తొలఁగిపోవుచున్నది.)

మారు—కమలాక్షీ!

ఉ. ఆయతకీర్తిచంద్రికస ♦ మావృతసర్వదిగంతరుండు శో
భాయతసత్త్వచారుఁ డన ♦ ఘాత్మకుఁ డర్థిచకోరచంద్రుఁడున్

కాయజరూపసంపదల ♦ గ్రాలెడు చోళపురాధినాథుఁ డో
తోయజనేత్రి ! చూపు మని ♦ దోర్బలనిర్జితవైరి యాతనిన్.

రోహి.—(తనలో) ఈతండు క్రూరుండును దుర్నయప్రవర్తకుండు నగు
టచే వీని నే నంగీకరింపఁజాల. (అని తొలఁగిపోవుచున్నది.)

మారు.—లతాంగీ!

ఉ. వారిజనేత్రి ! వీఁడో నలుఁడో ♦ వాసవుఁడో నలకూబరుండొ యి
చ్ఛారతిఁజూను వీరాతని వసంతుఁడొ కంతుఁడొ నాజయంతుఁడో
ధారుణిపై వెలింగెడు సు ♦ ధాకరుఁడో తెలియంగరా దహా
భూరిసువర్ణభూషణవి ♦ భూషితుఁ డీనృపపుత్రుఁ డెవ్వరో.

ఏణాక్షీ ! కిరీటమకరకుండలకేయూర హాటకాంబర మణిమయాలంకార
భూషితులై ప్రకాశించు నీరాజలోకంబున నీకిచ్చవచ్చిన వారె
వ్వరో చూపుము.

రోహి.—(తనలో) డెందమా ! త్వరపడకుము. త్వరపడకుము. ఓ భగ
వానుఁడా. సంకల్పసంభవా! దాక్షిణ్యమూర్తి వగు నీవు నాపై
కరుణించి నామనోహరుని చిత్తమును నిష్కళంకముగఁ జేయు
ము. (అని సభికులందఱుఁ జూచుచుండ సుధాకరుని మెడలో
పుష్పహారంబును గీలింపుచున్నది.)

(అంత దమనుఁడు ప్రవేశించి)

దమ.—సభాధ్యక్షులారా !

చ. విమలయశోవిశాలప్రవృత్తి ♦ పీపతులార ! కనుండు కంచభూ
తములను మీరు సాక్షులుగ ♦ దా వనితామణిచిత్త చోరు మో
దమునను గాంచి పీనియతు ♦ తక దగిలించెరు వేడ్కఁ బుష్పదా
మమును వధూమణి స్వరుని ♦ మత్సరమూనక పెండ్లిఁ గూర్పుఁడీ.

[అంత నందఱు విఫలితమనోరథులై చూచుచుండ రాజశేఖరుఁడు లేచి]

రాజ.—రాజా ! దశమహీధవా !

ఉ. ఓధరణీప! యేల మము ♦ నొయ్యనఁ బిల్వఁగఁబంచి తీవు రా
జాధమ నీతనూజను స్వ ♦ యంవరమన్నెపమేత సింహళ
క్ష్మాధవసూనుచే నిడి మృ ♦ షావచనంబులువల్కి యిట్లు పృ
థ్వీధవులందఱిన్ బరిభ ♦ వించితి వైనను బోవనిత్తుమే.

దత్తు—ఆఁ! ఏమి! ఎంతపనిజరిగెను! (అని మహాకోపముతో పండ్లు పెటపెటఁ గొఱుకుచు) ఓరోరిరాజద్రోహీ! క్షత్రియకులపాంసనా! యేమిరా, నీవిట్లు క్రిందుమీఁదు నెఱుఁగక సాహసించితివి? ఇపుడు నిన్నేమి చేసెదనో చూడుము.

(అని సుధాకరుని చేయిఁబట్టుకొని యదలించుచున్నాఁడు,)

సుధా—(కరంబు దిగిచికొని కోపఘూర్ణమానతారకుండై పండ్లు పెటపెటఁ గొఱుకుచు.) ఓనరపాలకులకలంకులారా!

ఉ. త్రుళ్ళిపడంగనేల యిదె ♦ దోర్బలవృత్తి నటించి వేడ్కనో
విల్లునఁ బూనియున్న పృథి ♦ వీపతులార! రణంబులో మిమున్
బ్రెళ్ళఁగఁజేసి రాక్షసవి ♦ ధిన్ గ్రహియించెదఁ గన్య దంతికిన్
జెల్లున కేసరిం గడియఁ ♦ జేరఁగ చూడుడు నాప్రతాపమున్.

(అని యందఱుఁ గలంగునటుల ధనుష్టంకారంబుఁ జేయ రోహిణి మూర్ఛిల్లుచున్నది.)

దత్తు—ఓసర్వంసహాధ్యక్షులారా! నాముద్దులపట్టి మూర్ఛాగతురాలై యున్నయది. మీర లిట్లు మారణోత్సాహపరులై వీరావేశంబులఁ బ్రకటింపుచుండిన నీమె ప్రాణములను నిలుప జాలదు. కావున మీరిప్పటికి శాంతింపుఁడు. మీకు నమస్కరించెద.

రాజ—మే మీనరాధముని సంహరించినఁగాని శాంతిఁబొందఁజాలము.

(అని వీరావేశంబున గొనయంబు సారించి విల్లెక్కిడి, సుధాకరుని డగ్గరి) ఓరోరి మానవాధమా!

ఉ. నీవెటకేఁగ దింక ధర ♦ నీవరులందఱుఁ జూచుచుండ ని
న్నే విధినైన నేను సమ ♦ యించెదఁ జంపియుఁ బొట్టఁజీల్చి నీ
ప్రేవులఁ దాల్తు నాయుఱుత ♦ వెచ్చని నెత్తురు ద్రావి పెండ్లికిన్
బ్రేవుమటంచుఁ బోయెద వ ♦ రించెదఁ గన్యకఁ జూడు దుర్మతీ.

సుధా—ఓరీ! నీచాధమా! విస్రంభవాచాటా! ఏమనిరా ప్రేలు
చుంటివి? ఇదిగో నీమదము సదమదము జేసెద చూడుము.
(అని వరలోనికత్తి పైకిదీసి ఝుళిపించుచు) ఓరి తులువా!

శా. భూతప్రేతపిశాచసంఘములకుం ♦ బూర్ణంబుగా విందు వి
ఖ్యాతిం జేయఁగఁ జూడు మోతులువ! దు ♦ ర్గర్వాంధ! నిన్నిప్పుడే
శాతాసిం గడతేర్తు నిల్వు మిట నీ ♦ చా! సిగ్గులేదో నిర్ల
జ్జేతఃప్రీతిని ద్రోల్లఁ జేయనె ఘనా ♦ జిం గాయము ల్మానెనే.

(అని యుద్ధమునకు మొనయుచున్నాఁడు.)

దమ—ఓహో! సూధవరులారా! శాంతింపుఁడు, శాంతింపుఁడు.
అన్నన్నా! ఎంతయుపద్రవము తటస్థించెను! నాపట్టి గాఢ మూ
ర్ఛాపరవశురాలై యున్నయది. మీరందఱు దారుణ రణోత్సా
హులై విజృంభించుచున్నారు. ఇంక నెట్లోగదా. (అని సన్నిహి
తవర్తులగు చెలికత్తియలతో) ఓపుణ్యాంగనలారా! వీరా
లీకోమలి నెత్తికొనిపోయి యంతిపురంబున శయనింపఁజేసి,

చ. అలరులపుప్పొడుల్ వరచి ♦ నట్టి మనోహర హంసతూలికా
తలమునఁ బండఁజేసి విరి ♦ దమ్ములవీచుచు పై హిమాంబువుల్
జిలుకుచు మేన ఛందనము ♦ జెన్నుగఁ బూయుచు చెంతఁజేరి రం
జిలు మృదులంపుపల్కులను ♦ జెప్పుచు జేయుఁడు శైత్యసేవలన్.

దమనా! నీవుకూడ వీరివెంటనేగి తగుచికిత్స లొనరింపుచుండుము.

దమ—చిత్తము. చిత్తము. (అని చెలికత్తియలు దాను రోహిణి నెత్తు
కొని నిష్క్రమించుచున్నారు)

(అంత గగనంబుననుండి యొక ధ్వని)

గంధ—ఓహో దుర్మదోద్రగులగు రాజాధములారా! ఏల మీరిట్లు నిష్కారణము సమర సన్నాహులై కలగుండుపడియెదరు? శాంతింపుఁడు, శాంతింపుఁడు, ఓ దక్షమహీధవా!

ఉ. పూర్వభవంబునందు బహు ♦ పుణ్యుఁడ వీవు నృపాల వీరి నీ
యుర్విఁ జరించుచున్ గని మ ♦ హోజ్జ్వల తేజము కోటుజెంది గం
ధర్వుల మేము వీరి నొక ♦ తట్టునఁ జేర్చి పరస్పరంబు దృ
క్పర్వములౌనటుల్ సలుపఁ ♦ బాయని మోహముఁ జెందిరొండొరుల్.

క. కావున శంకింపక నీ
భావజరూపునకు నీదు ♦ పట్టి నొసఁగి పృ
థ్వీవర సల్పుము వేగమె
వైవాహికశుభము వీరు ♦ వర్ధిలుదు రిలన్.

దక్షు—ఆహాహా! సభ్యులారా! వింటిరా గంధర్వవరుల పలుకులు? దేవతాప్రేరితంబగు నీకార్యం బవశ్యకర్తవ్యంబని తోఁచెడు. మీయభిప్రాయ మేమి?

సభ్య—రాజా! నీ వెంతమాత్రము సంశయింపక నీశుభకర్మంబును శీఘ్రంబుగ నెరవేర్పుము. దేవతాభిమానోన్నతులగు నీవధూవరులు చిరానురాగవైభవసమృద్ధులై వర్ధిల్లఁగలరు.

రాజ—రాజా! మాయావులగు గంధర్వులపలుకులు విశ్వసింపకుము. క్షత్రియధర్మంబును విడనాడకుము. న్యాయముఁ దలంపుము.
(అని సుధాకరునితో యుద్ధమునకు మొనయుచున్నాఁడు.)

దక్షు—ఓవీరులారా! మీరు వేఱొక బహిఃప్రదేశంబునకుఁ బోయి న్యాయయుద్ధంబు జేయుఁడు. అందు జయలక్ష్మిం జేకొనివచ్చిన పురుషుండే నాకుమారీమణినిఁ జేకొన నర్హుండు.

రాజ—మంచిది. (అని సుధాకరునితో) సుధాకరా! నీవు పౌరుషము గలవాఁడవైనచో నాతో న్యాయయుద్ధంబుఁ జేయ వేఱొక బహిఃప్రదేశంబునకు రమ్ము. లేనిచో నోడితి ననుము.

సుధా—ఓరి వృథాభిమానీ! రమ్ము. ఈసారి శత్రుశేషంబుఁ దీర్చి కృతార్థుండ నయ్యెద.

(అని సుధాకరుఁడు రాజశేఖరుని చెయిపట్టి తోడ్కొనిపోవుచున్నాఁడు.)

దక్షు—సభాధ్యక్షులారా! మీరుకూడ దయచేసి చని వారియుద్ధంబున న్యాయాన్యాయంబులు విమర్శించి రండు.

సభ్యు—మంచిది (అని సభ్యులు నిష్క్రమించుచున్నారు.)

దక్షు—మంత్రిపుంగవా! నాపుత్రికారత్నంబునకుఁ దగిన శైత్యోపచారంబులు జరుగుచుండెనా? ఆకోమలిమూర్ఛ యిపు డెట్టిస్థితిలో నుండెనో తెలియరాదు.

మారు—దేవా! ఆగాఢమూర్ఛ క్రమక్రమముగ చెలికత్తియలొనర్చు శైత్యోపచారంబులవలనఁ దగ్గిపోవుచున్నదఁట. అదిగో దమనుఁడు నిటులనే వచ్చుచున్నాఁడు.

[అంత దమనుఁడు ప్రవేశించుచున్నాఁడు]

దక్షు—దమనా! నాపట్టి మూర్ఛ యిపు డెట్టిస్థితిలో నున్నదో తెల్పుము.

దమ—చిత్తము, దేవా! వినుండు.

సీ. ఘనసారచందన ♦ కలితలేపనమున, నలఁదఁబోయిన నెంతో ♦ యులికిపడును
పునుఁగుజవ్వాజియు ♦ తనువునఁ బూయంగఁ, గడగిన మెయి గగు♦ర్పొడువ బెదరు
వీఁక తో భుజతాళ ♦ వృంతంబులను వీవఁ, దిరిరినఁ గృద్ధయై ♦ తేరిచూచు
నరవిరిపూసెజ్జ ♦ యందుఁ బండఁగఁ జేయఁ, బూనఁ గుంటలటంచుఁ ♦ బొదరుచుండు
తే. గీ. శిరమునకు మంచిపన్నీరు ♦ చిలుక నేడ్చు, యత్న మెంతయొనర్చిన ♦ నదటుఁ జెందు
నొనర మీపుత్రికకును ♦ శైత్యోపచార, ములను క్రమముగ మూర్ఛతాఁ ♦ దెలియుచుండె.

[అంత విజయోల్లాసితుండగు సుధాకరుండు సభ్యులతో ప్రవేశించు చున్నాఁడు.]

సుధా—రాజేంద్రా! న్యాయయుద్ధంబున పూర్ణవిజయుండనై వచ్చితి. ధర్మమార్గానుసారంబుగ మీకుమారీమణిని నాకొసంగవలయు.

దక్షు—ఆద్వంద్వయుద్ధమున రాజశేఖరుండు నిహతుండయ్యెనా యేమి?

సుధా—దేవా! రాజశేఖరుం డప్పరోంగనలపొందు నభిలషించి దివంబునకరిగియున్నాఁడు.

దక్షు—అన్నన్నా! ఎంతపని జరిగెను.

తే. గీ. చిరతరస్నేహభావంబు ♦ గరిమఁజూప
వచ్చి నాపుత్రికాస్వయం ♦ వరమునకును
కటకటా! నీవు పరలోక ♦ గతుఁడవైతె
కదనమున నోడి రాజశే ♦ ఖర సఖుండ.

అయ్యయో! వీరిని నేనేల యుద్ధమునకు మొనయఁజేసితి.

[అంత నంతరిక్షమునుండి యొకధ్వని]

గగనవాణి—రాజా! గతించినదానికై చింతింపకుము. రోహిణీసుధాకరుల కిదివఱకే గాంధర్వవివాహమైయున్నది.

దక్షు—ఇఁకమనము కాలవిళంబనము చేయరాదు. మారుతీ! శుభముహూర్తంబు నిర్ణయింప మహామౌహూర్తికులరావింపుము. ఈశుభవర్తమానంబును సింహళద్వీపధరావరేంద్రుండగు రత్నాకరమహారాజుగారికి తెలియింప చారులను బంపుము. తక్కుంగల బంధువర్గంబులకెల్ల సంభావనపూర్వకంబుగ శుభలేఖలను వ్రాసియంపుము. మఱియు,

శా. ఆపద్మాలయు శౌరికోరినటు లా ♦ హా రోహిణిన్ సింహళ
ద్వీపాధ్యక్షసుతుండు కోరుటను వే ♦ విస్ఫారఘంటాధ్వనుల్
ప్రాపింపంగ మదావళంబుపయి శుం ♦ భల్లీలవైవాహికం
బేపారు న్వినుడంచు జాటుముజనుల్ ♦ తృప్తింగనంగన్ బురిన్.

మారు— చిత్తము. దేవా. (అని మారుతి నిష్క్రమించుచున్నాఁడు.)

సభ్యు— రాజా! మే మిప్పటికి వీడ్కొనియెదము. (అని సభ్యులు నిష్క్రమించుచున్నారు.)

దత్తు—(దమనునితో) దమనా! నీవు నాకు మహోపకారివి. ఏమిచ్చి నను నీఋణంబు దీర్పఁజాల. ఇట్టిమహోత్సాహసమయం బెన్నటికైనఁ జేకూరునని స్వప్నములందైనఁ దలంచితినే? ఎన్నటికైన నీమేలు మఱువఁజాలుదునే?

చిత్ర— దేవా! వినుండు.

చ. దమనుఁడఁగాను నేను మును తల్లిని బాసి యనేకదేశముల్
క్రమముగ సంచరించి తుది గ్రమ్మఱవచ్చియు వెండి రోహిణీ
కమలదళాయతాక్షి నిజ కాంతునిఁ గోరియుఁ బోయి నేఁటికి
సుమశర తేజు నీనృపతి నూజునిఁ దెచ్చిన చిత్రసేనుఁడన్.

దత్తు— ఓహోహో! చిత్రసేనా! ఎంతకాలమునకు నిన్నుఁ దిరుగఁ జూడఁగలిగితినిరా! బహుకాలము పరదేశవాసముఁ జేయుచు నెన్నియిడుమలం గుడిచియుంటివో కదా. నీవు శీఘ్రింబుగ నంతిపురంబునకుఁ జని నీరాకకై యత్యంతాసక్తితో నిరీక్షించుచుండెడు నీతల్లిని జూచిరమ్ము.

దమ— దేవా! నేనిదివఱకే రాజజననికిని రోహిణీకన్యకకును గనఁబడియుంటి.

దత్తు— మంచిది. అటులైన నీవు ఖనికశిల్పికాదివరుల రావించి పెండ్లి పందిళ్ళు నిర్మింపఁజేయుము. మఱియు,

చ. పగడము మంచిముత్తియము పచ్చ పసిండియుఁ గూర్చి తీరుగా
జిగిబిగితోరణంబులను జెల్వుగఁ గట్టుడు మానికంబులన్

[అంత విశారదుఁడు ప్రవేశించి]

విశా—దేవా, నేనపరాధినైతిని. నన్ననుగ్రహింపుఁడు! (అని పాదములపై వ్రాలుచున్నాఁడు.)

రత్నా—విశారదా! క్షమించితిని. లెమ్ము.

[అంత దక్షమహారాజు మారుతియుఁ బ్రవేశించుచున్నారు.]

దక్షు—(రత్నాకరుని సమీపించి) మహారాజా! మనముభయులము పూర్వవైరంబులం దిగనాడి యన్యోన్యసంబంధబాంధవ్యంబులచేఁ బరస్పరమైత్రి నుండవలయునని నాకోరిక. అట్టినాయభీష్టంబొనగూర్ప నాముద్దుకూఁతుఁ దమకోడలుగాఁ గైకొనుఁడు.

రత్నా—మిత్రమా! దక్షమహీధవా! ఇంతకన్న మేలెయ్యది? నీవంటివానితో వియ్యమందుటకన్న నాకు వేఱొండు భాగ్యమబ్బునే? (అని కరలగ్నమంబుల నన్యోన్యమైత్రిఁ బ్రకటింపుచున్నారు.)

దక్షు—(రత్నాకరునితో) మహారాజా! వివాహమంటపమును బ్రవేశింతము రండు.

రత్నా—మంచిది. (అని యిరువురు వివాహమంటపమును బ్రవేశింపుచున్నారు.)

---

రంగము:—వివాహమంటపము.

[మంగళతూర్య నినాదంబులు బ్రాహ్మణాశీర్వాదంబులును జెలంగ రోహిణి సుధాకరుని మెడను పుష్పహారమును గీలింపుచున్నది.]

దక్షు—(సుధాకరునిడగ్గఱి) రాజకుమారా! మున్ను నీమహిమను గుర్తెఱుంగఁజాలక నీయెడల నేనొనర్చిన మహాపరాధంబులనెల్ల సైరించి నాపుత్రికారత్నంబును బరిగ్రహించితివి. ధన్యుండనైతి.

మఱియు,

శా. నారీరత్నము నీకొసంగితిని భూ నాథాత్మజా! నీవు మం
దారోర్వీజమవోట నిందుముఖి పొం తీ మల్లెతీవోటఁ ద
ద్భారంబీవు సహించియిచ్చుచును శ శ్వత్కామితార్థంబులన్
నీరక్షీరములట్ల మీరు మనుఁడీ నిత్యానురాగంబునన్.

(అని రత్నాకరునితో) మహారాజా!

ఉ. పొంకము మీఱఁ బూర్వభవ పుణ్యవశంబున మిమ్ముఁ బోలు వి
య్యంకుని గంటిఁ గావునఁ గృ తార్థుఁడనైతి వధూవరుల్సదా
యంకిలి లేనిమైత్రి వెల యన్ భువివర్ధిల దీవనంబు నే
నుంకువగా నొసంగెద స హో! నృప హీరిసమాదరింపుమా.

(అంత రోహిణి మామకుఁ బ్రణమిల్లుచున్నది.)

రత్నా—ఓస్నుషారత్నమా! ఈసుధాకరుండను నాసత్కుల దీపము
నీగుణశీలస్నేహప్రేరితంబై బహువిధంబులుగఁ బ్రజ్వరిల్లెడు.

దక్షు—(పుత్రిక నతిప్రేమచే దగ్గఱఁ జేర్చి) పుత్రికారత్నమా!

చ. కలికిరో! నీవు నీపతియు గాఢపరస్పర రాగపూర్ణులై
యలరుచు భూరిరాజ్యవిభ వాన్వితులై లసరారి పుత్రులన్
బలువురఁ గాంచి కీర్తిగని పాయక భక్తిని నత్తమామలన్
బలుమరు సేవలందనిపి భాసిలుచు న్నము పీడఁ బోకుమీ.

రత్నా—దక్షమహీంధవా! నేటికి భగవత్కటాక్షంబున మనకోరికలన్ని
యు నెఱవేరినవి. ఇంక నేమి కావలయును.

దక్షు— మాలిని.

నీతిగనీధర ణీ పతులందఱు నెమ్మిని రాజ్యము లేలవలెన్
ఖ్యాతిగ మేఘుఁడ ఖండసువృష్టిని గల్గఁగఁజేయ ఫలోన్నతమా

క్ష్మాతలమందున గే మానవు లప్రీతి గే మానసుఖంబుల వర్ధిలుచుఁ
బ్రీతిఁ నాథగ గే వంతుని నిశ్చలభక్తినుతింపుచు నుండవలెన్.

గగనవాణి—తథాస్తు. తథాస్తు.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

గద్య.

ఇది శ్రీమద్వేంకట రమణకరుణాకటాక్ష వీక్షణాసారసమాసాదిత
రసబంధుర కవిత్వవైఖరీప్రవీణాపస్తంబసూత్రి శాండిల్యసగోత్రి
పవిత్రహోతృకులకలశార్ణవరాకాకైరవమిత్రి వేంకటరత్న
సుపుత్ర వెంకమాంబాగర్భశుక్తిముక్తాఫల వివిధ
విద్వజ్జనవిధేయ వేంకటకృష్ణనామధేయ ప్రణీతం
బైన రోహిణీ సుధాకరవిజయంబను నాట
కంబున సర్వమును షష్ఠాంకము
సంపూర్ణము.





# మావద్ద వెలకు దొరకు గ్రంథములు.

1 సంగీతకృతిదర్పణము—నూరు కృతులు వగైరాలు స్వరపరచినగ్రంథము (మార్బిలుబైండు) ... 1- 8- 0

డిటో (క్యాలికో బయిండు) ... 2- 0- 0

2 సంగీతకృతిదర్పణము—2వ భాగము. సంగీతవిద్యార్థులు కాగలందుల కనేక సాధనములుగలవు. ... 2- 0- 0

3 పైగ్రంథములు రెండుగలిపి పూర్తి క్యాలికోబయిండు చేసిన ప్రతి 1కి ... ... ... 3- 0- 0

4 స్వరవర్ణసుధానిధి—వర్ణము లాఖరువరకు కావలసిన పాఠములు గలవు. ... ... 1- 8- 0

5 రోహిణీసుధాకరవిజయము—6 అంకముల చక్కని నాటకము ... ... ... 0-12- 0

6 ద్రౌపదీస్వయంవరము—5 అంకముల చక్కని నాటకము ... ... ... 0-12- 0

7 సుభద్రార్జునీయము—6 అంకముల చక్కని నాటకము 0-12- 0

8 శశిరేఖ—5 అంకముల చక్కని నాటకము. ... 0-12- 0

9 సుభద్రాకళ్యాణము—మంగళగానము—స్త్రీలు పాట పాడుటకు యోగ్యమైనది ... ... 0- 5- 0

10 స్వరాజ్యయాశ్వరస్తవము—(పద్యములు) ... 0- 4- 0

11 గాంధిసందేశము—(పద్యములు) ... ... 0- 4- 0

మావద్ద యితరమైన నవలలు, నాటకములు వగైరాలు కలవు, క్యాటలాగు కోరినవారికి ఉచితముగా పంపబడును.

పారుపూడి సుబ్బారావు & సన్సు,

కాకినాడ.